I శ్రీరస్తు. ౫౦-౯౮

# సంపూర్ణ రామాయణము.

ప్రకరణనాటకము.



ఇది

చక్రావధానుల మాణిక్యశర్మగారిచే

రచియింపఁబడినది.

పబ్లిషర్సు

రవుతు చంద్రయ్య

సన్‌లైట్ బుక్కుడిపో, బుక్కు సెల్లర్సు అండ్ పబ్లిషర్సు

రాజమండ్రి


☞ శ్రీ చింతామణి ముద్రాక్షరశాలవారిచే

ముద్రింపఁబడియె

రాజమహేంద్రవరం.

1929


దీనివెల 1—4—0] [రిజిష్టర్డు కాపీరైటు.

# ఈనాటకమునందు వచ్చు పాత్రలు.

:o:

పురుషులు.

1 బ్రహ్మ.
2 ఇంద్రుడు.
3 అగ్ని.
4 యముడు.
5 విష్ణు.
6 రుచికుడు.
7 దశరథుడు.
8 వశిష్ఠుడు.
9 విశ్వామిత్రుడు.
10 రాముడు.
11 లక్ష్మణుడు.
12 భరతుడు.
13 శత్రుఘ్నుడు.
14 జనకుడు.
15 శతానందుడు.
16 పరశురాముడు.
17 విరాధుడు.
18 కబంధుడు.
19 రావణుడు.
20 ప్రహస్తుడు.
21 మారీచుడు.
22 కబంధుడు.
23 జటాయువు.
24 హనుమంతుడు.
25 సుగ్రీవుడు.
26 అంగదుడు.
27 జాంబవంతుడు.
28 వాలి.
29 విభీషణుడు.
30 అక్షయకుమారుడు.
31 రాక్షసుడు.
32 యింద్రజిత్తు.
33 శుకుడు.
34 గంధర్వుడు.
35 మాతలి.

స్త్రీలు.

1 వసుంధరాదేవి.
2 కౌసల్య.
3 కైక.
4 మందర.
5 తాటకి.
6 అహల్య.
7 సీత.
8 నందిని.
9 తార.
10 అయోముఖి.
11 లంక.
12 ధూమ్రాక్షి.
13 త్రిజట.
14 శూర్పణఖ.
15 కలహంస.



# నాంది

శా. క్షీరాబ్ధిస్థిత శేషతల్పుఁడగు ల ♦ క్ష్మీనాథు డుర్వీభర
క్రూరామర్త్య విరోధిరావణుని, ని ♦ ర్మూలించి సర్వంసహా
భారంబుఁ దొలగింప బంక్తిరథ భూ ♦ పాలాత్మజుండౌచు నా
శ్రీరామాఖ్య జెలంగు నీశుమదిలో ♦ సేవింతు నశ్రాంతమున్.

(పూలను సభమీద జల్లి)

సూత్ర—ఓహో! నిరంతర సకలనిగమ కళారహస్యపారీణులును విశేష శేముషీసింధువులును సంతత స్వధర్మరక్షణపర నానా పురుషసింహులును కలిగి విలసిల్లు నీ సదస్సెంత శోభస్కరముగ నున్నది! కావున.

మ. సకలాపజ్జనరాశి తాఁకము మో ♦ క్షప్రాప్తికిన్ గారణం
బకళంక ప్రతిభావిభాసిత స్వరా ♦ జ్య శ్రీకరంబైన పూ
షకులాంభోధి సుధాంశురాఘవుని స ♦ చ్చారిత్రమున్ దృశ్యకా
వ్య కళాయోగముచే సదస్యులను హ ♦ ర్షాంభోధిఁ దేలించెదన్.

ఆ నాటక ప్రయోగమునకై మా నటిని బిలచి యోజించెదను [తెర వంకజూచి] ఓసీ నాట్యలతా! నీ యలంకారము త్వరితముగ బూర్తి చేసికొని ఒకసారి యిటురమ్మా.

నటి—(ప్రవేశించి) నాథా! ఇదే వచ్చితి. నాజ్ఞ యేదో నిరూపింపుము

సూత్ర—ప్రియురాల! మన మేదో పుణ్యకథను నాటక రూపమున బ్రయోగించి తమ్మానంద పఱచెదమని పేరాశచే వచ్చిన యీ సదస్యుల హృదయముల రంజింప జేయుటకై నిన్ను బిలచితిని.

నటి—నాథా ! అందుల కిప్పు డేనాటకమును ప్రయోగింప దలచితిరో ఆనతీయుడు. పాత్రవర్గమును సిద్ధపఱచియే యున్నదాన.

సూత్ర—జీవితేశ్వరీ ! కళ్యాణ గుణార్ణవుండును సర్వంసహా భారమడంప దుష్టరాక్షసుల సంహరించి దేవమునుల నుద్ధరించిన భగవంతుడైన శ్రీరామచంద్రుని సత్కథవినా మనకు వేరు ప్రాపు కలదా ?

నటి—అట్లైన నేకవిరచించిన రామనాటకమును బ్రయోగింతము.

సూత్ర—చెలీ ! బ్రహ్మశ్రీ చక్రావధానుల మాణిక్యశర్మగారు రచించిన సంపూర్ణరామాయణనాటక మాడవలయు గావున నీవు ఋతువర్ణనము సేయుము.

నటి—చిత్తము.

చ. నుతులభవంబు చైత్రముగ సుందరికైక రుషోక్తి గ్రీష్మముల్
దితిజులవ్రేగు వార్షికము నిస్తులవాసరమైత్రి యా శర
ద్ధృతువు సమీరజప్రతిభ యే హిమసద్మృతు వుగ్రరావణో
త్పతనమె యాశిశిర్తువుగ భాసిలె బంక్తిరథేశు తేజముల్.

సూత్ర—బాగు బాగు. శ్రీమద్రామాయణము షట్కాండలను చక్కగ నారు ఋతువులుగ వర్ణించితివి. మనమిక ననంతర కరణీయమునకై త్వరపడుదము రమ్ము. మన కుశలవులప్పుడే బ్రహ్మాదిసురల భూమికలదాల్చి క్షీరాబ్ధిప్రాంతమున జేరుచున్నారు (నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.





శ్రీ

# సంపూర్ణ రామాయణ నాటకము.



## ప్రథమాంకము.



### 1 వ రంగము—క్షీరసాగర ప్రాంతము.

(బ్రహ్మయు నింద్రయమాగ్నులును ప్రవేశించెదరు)

ఇంద్రు—పితామహా! మా యిక్కట్టుల నేమని చెప్పుదుము?

మ. సమదోద్రేకముతోడ రావణ ♦ ముఖుల్ స్వర్గమ్మునం జేరి మా
యమరస్తోమముఁగొట్టి యచ్చరల మో ♦ హాంధమ్మునన్ మానభం
గము గావించుచు దేవరాజ్యపదముక్ ♦ గైకొంట యేకాక ని
త్యము దైత్యాళిపదంబులొత్తమని ది ♦ వ్యశ్రేణి బాధించెదుర్.

కావున నా రావణాద్య సురబాధ సహింపలేకున్నవారము. నాకీ సురసామ్రాజ్యఫలము దానవసేవగ బరిణమించినది మా యలమట దీరు నుపాయం బాలోచించి మమ్ము రక్షించుడు.

బ్రహ్మ—పురందరా! కాలవైపరీత్య మట్టులుండ దప్పింపదరమా! నే నా వైశ్రవనుని దుర్వర్తియము మహర్షులవలన వినియే యున్నాను తన్నివారణమునకై కమలాక్షునితో నాలోచించుటకే వచ్చినాను.

యమ—కమలసంభవ! నాకీ యంతకసమాఖ్య యెందులకో తెలియకున్నది.

చ. జగతిని బాపజీవులను ♦ సంహరణం బొనరింప గశక్తి నీ
వగుదువటంచు నంతక న ♦ మాఖ్యనొసంగిరి నాకు నన్నె చం
పగగమకించె దానవులు ♦ బల్మిని, వ్యర్థము సేతిబీరకా
యగతిని నాదు పేరు కమ ♦ లాసన! సిగ్గుగదా వచింపగన్.

నేను సముద్రుడనై రాక్షసుల జంపగూడదట. దక్కిన పుణ్యజనుల జంప వలెనట.

అగ్ని—మహాత్మా! సిగ్గువిడచి నా యవస్థను గూడ జెప్పెద నాక ర్ణింపుము.

గీ. అఖిలలోకను దహి ♦ యించునట్టి నన్ను
బలుగు రాకాసులే ద ♦ హింపంగజొచ్చె
నయ్యయో! నాయవస్థ ♦ నేమందునయ్య
దహనుడను పేరు నాకేల ♦ దగులబెట్ట.

అంతియేకాదు. నే నా రావణహంతకునకు వంటలవాడనై యుండవలశి వచ్చినది. వరుణుడు జలములను గూర్పవలయునట వాయుదేవుడు వీధుల నూడ్చి పరిశుభ్ర పరచవలెనట.

బ్రహ్మ—ఓ యింద్రాగ్నియములారా! మీరు చింతిల్లకుడు. రావ ణుని దౌర్జన్యమే వానిని సంహరింపగలదు. అల్లదే రక్క సులవ్రేగు సహింపలేక వసుంధరాదేవి నారాయణునితో మొరబెట్టుటకై కాబోలు నీలాగే వచ్చుచున్నది. ఆమె ననుస రించి మనమును నారాయణుని వేడుకొందము.

వసుంధరాదేవి—(ప్రవేశించి)

ఉ. శ్రీలలనా మనోరమణ ♦ శేషశయాన దురాత్మరావణో
ద్వేలభరంబు నే ననుభ ♦ వింపగజాలనఘప్రచార మే
చాలగ విస్తరిల్లెను నృ ♦ శంసులు సాధ్వుల మానభంగ మే
వేళను జేయు నాయఘము ♦ వ్రేగును మోయగజాల బోదవే.

బ్రహ్మ—తల్లీ ! వసుంధరాదేవి ! నేనును యీ యింద్రాదిదివ్యులును ఆ రావణాదిబాధలకే సహింపలేక రక్షణార్థమై పంకజాక్షుని శరణువేడ వచ్చితిమి. నీ ప్రాపువలన మాకా లక్ష్మీకళత్రుని సందర్శన భాగ్యము లభించునని సంతసిల్లుచున్నాము. కావున కేశవుని ప్రార్థింపుదము.

వసుంధ—దివ్యులారా ! అటులే ప్రార్థింతము.

దండకము—శ్రీమద్రమా మానసాంభోజ మిత్రా ! సుధావార్ధి శేషాహితల్పా ! మునిస్తోత్రపాత్ర ! శ్రితారణ్యచైత్రా ! పులస్త్యాన్వయో ద్భూతమైనట్టి యీ రావణాభిఖ్యముఖ్యా సురస్తోమ ముగ్రంబుగా బ్రహ్మముఖ్యాసుర స్తోమముంబట్టి బాధింపుచున్నారు దేవా ! తదీయాఘభారంబు సైరింపగాలేక నేనుగ్గుచున్నాను. నీవీ మహాభారకల్లోలమున్ మాన్పవాందుష్టదైత్యాళి సంహారమున్ జేసి మాక్లేశ సంతాపముల్ బాపవే ! యాగమాంతప్రచారా ! గుణోదారశౌరీ ! నమస్తే నమస్తే నమః

విష్ణు—(శేషతల్పుడై ప్రత్యక్షమగును.) ఓ బ్రహ్మేంద్రాది సురలార ! వసుంధరాదేవి ! మీరా రావణప్రముఖ రాక్షసులచే బహుబాధల నెఱింగియే యున్నాను. కాని వాడిప్పుడు బ్రహ్మదత్తవరంబుచే నసాధ్యుడై యున్నవాడు. మీరు కొంత కాలమోర్చి యుండవలెను. కాదందురేని నాసుదర్శన చక్రము నిప్పుడు వానిమీద బ్రయోగించెదను. తత్పర్యవసానమును మీరు దివ్యదృష్టిచే దిలకించుడు. [చక్రమును బ్రయోగించును.]

బ్రహ్మ—మహానుభావ ! ఆశ్చర్య మాశ్చర్యము. నీచక్ర మా రావణుని కంధరమునకు బుష్పహారమైనది. యిది యంతయు నే

నొనరించిన యపచారము యెట్టులైన నీవే మా యీ యాపదను దొలగించి రక్షింపుము.

విష్ణు—అమరులార ! కొంతకాలము సైరింపవలయును. నేను మన కులమున దశరథునకు రాముడనై యవతరించెదను. నాశంఖు చక్రములు భరతశత్రుఘ్నులు గను శేషుడు లక్ష్మణునిగను జనింపగలరు. లక్ష్మి సీతయైపుట్టును. రావణుడు సీతను దస్కరించును. మీ దేవత లందరు వానరాంశతో జనించుడు. నేనా రావణుని సంహరించి మీ యలమట దీర్చెదను. అంతవరకు సహించి యుండవలెను.

వసుం—మహాభాగ్యము.

బ్రహ్మ—భగవన్నారాయణ! మీ రామావతారమునకై నిరీక్షించు చుందుము.

(అందరు నిష్క్రమించెదరు.)





శ్రీ

# సంపూర్ణ రామాయణ నాటకము.

## ద్వితీయాంకము.



### 1 వ రంగము—అయోధ్యాపురవీధి.

[రుచికుడు ప్రవేశించును.]

రుచికు—ఆహా! మా వసిష్ఠగురువుని ప్రభావ మద్వితీయముకదా! అరణ్యమున నొక జలాశయమున గలిగిన బుడబుడ ధ్వని నాలకించి మదగజంబని కోలచే నొక మునిపుత్రుని మా దశరథ మహారాజు గూల్ప నాయజ్ఞదత్తుడు ధరగూలి హా రాజా! నన్నుగూల్చి యంధులైన నా పితరులను హా పుత్రా! యని మరణించునట్లు చేసితివి. కావున నీవును పుత్రులు లేక హా పుత్రా! హా పుత్రా! యని శోకమున మరణించెదవని శపించెను. యీ విధమైన విచారమున నున్న దశరథుని చేత ఋష్యశృంగు డను మునీంద్రుని బిలిపించి పుత్రకామేష్టియాగమును చేయించెను. ఆ యజ్ఞపాయసము భక్షించి కౌసల్యాదేవి రాముడను కొమరునిన్ని, సుమిత్ర లక్ష్మణునిశత్రుఘ్నుణ్ణి, కైక భరతుని గాంచెను. ఆహా ఆ పంక్తిరథుని పుణ్యమేమనందును? అదిగో మా దేశికుండు వశిష్టుడు పుత్రోత్సవము చేయించి పోవుచున్నాడు. నేనును వారి ననుసరించెదను.

[నిష్క్రమించును.]

2 రంగము—సభాభవనము.

[దశరథ వశిష్టులు ప్రవేశించెదరు]

దశర—ఆచార్యోత్తమ ! వశిష్ఠ మునివర్య !

చ. నుతుల నపూపసీత పరి ♦ శోభితులౌనటు చేసినాము స
న్మతి ధనురాగమార్గ నిగ ♦ మంబుల బోధనొనర్చి శాస్త్రసం
తతుల రహస్యముల్ దెలిపి ♦ ధన్యులజేయుచే ! దేశికేంద్ర ! మీ
యతులిత సత్కృపామహిమ ♦ నందకపుత్రులు ధీరులౌదురే.

వశిష్టు—ఓ కోసలరమానాథా !

చ. అనులచరిత్రులైన భవ ♦ దాత్మజు లాగను మంత్రశాస్త్రముల్
సుమహితబుద్ధి నేర్చుటలు ♦ చోద్యము పుట్టుకతోనె సర్వశా
స్త్రములు దమంత దావలచె ♦ ధారుణినాధ ! త్వదీయ పూర్వపు
ణ్యమున మహానుభావులు ద ♦ యంబునగాంచిరి నీకు బుత్రులై.

దశర—స్వామీ ! మా రఘువంశంబు నందుమీ రాజన్న సుప్రసిద్ధాభి
మాన ముండుటం జేసి తథావిధంబుగ బలుకుచున్నారు కాని
మహావిద్యలేమి తనుంత దావలచుటేమి ?

వశిష్టు—దశరథ మహీపాలా ! నిగర్వమానామణివైన నీవు పుత్రుల
విషయ మట్లు పలుకు టుచితమే కాని రామలక్ష్మణ భరత
శత్రుఘ్నులు నల్వురు నాల్గుదిక్కుల నేలదగినవారు. అందు
శ్రీరామలీలలు.

మ. అవనీభార విమోచన క్రియకళా ♦ వ్యాహార శీలంబులున్
స్తవనీయంబులు సత్కృపారస నదీ ♦ సంతానముల్ పాలనాం
కవిలాసంబులు దాష్టసంఘహరణో ♦ త్కంఠబులున్ ఘోరపా
పవిదాహంబులు రామలీలలని నీ ♦ స్వాంతంబునం దెంచుమా.

[తెరలో] జయతు జయతు శ్రీరఘుకుల క్షీరాబ్ధి రాకానుధాకరః దశ
రథ మహారాజః.

దశర—ఆచార్యోత్తము ! ఆ జయధ్వాన మెవ్వరిదై యుండునో.

వశిష్ఠు—భూపాలమణీ ! అలఘుతపోనిధానుడైన విశ్వామిత్ర మునిదని తలంచెదను.

విశ్వామిత్రుడు—(ప్రవేశించి) జయతు జయతు శ్రీరఘుకుల క్షీరాబ్ధి రాకాసుధాకరః దశరధ మహీపాలః.

దశర—[లేచి వినయమున] భగవన్ కౌశికమునీంద్ర! నాయభివందన మంగీకరించి యీ యుచితాసనము నలంకరింపుడు.

విశ్వా—వసుంధరారమణ ! భవతాం శ్రేయోస్తు కూర్చుచుండుము.

దశర—మహాత్మా ! విశ్వామిత్ర సంయమీంద్ర !

చ. నిరతము సత్తపోభిరతి • నిస్తులసర్వమఖక్రియాఫలో
త్కర సముపార్జనాభిరత • గ్రన్ననవీడి త్వదీయభక్తులై
వరలెడు నస్మదీయ రఘు • వంశపు రాజులమీద నీదృశా
దరణము జూపవచ్చుటను • ధన్యుడనైతిని మౌనిచంద్రమా.

స్వామి ! మీచరణకమలంబొసంగితి గేలి పాద్యము నొసంగెదను.

విశ్వా—రాజా! నీయత్యాదరరసమే మాకు బాధ్యమైనది. నీవిక్ష్వాకుకులమున కలంకారభూతుడవు. నీవలనగదా! అస్మదాదుల నిర్వ్యానుష్ఠాన జపతపో హోమక్రియాదుల విచ్ఛిన్నంబుగ జరుగుట.

దశర—మీయందలి వాత్సల్యమున నట్లనుచున్నారుకాని నేనట్టిస్తోత్ర్యమున కర్హుడ నగుదునా?

విశ్వా—నీవందుల కర్హుడవగుటచేత నే నిన్నొకటి యాచింపవచ్చితిని.

దశర—మహాత్మా ! యాచింపవచ్చితిననకుడు ఆజ్ఞాపింప వచ్చితిననుడు మీచరణదాసుడు మీయాజ్ఞకు గృతాంజలియై సిద్ధముగ నున్నాడు. ఆజ్ఞాపింపుడు. తప్పక మీ యభీష్టమును దీర్చెదను.

వసి— (తనలో) ఈప్రార్థన విన నేదియో రాజునకు మనస్సంకటమును గల్పింప దలచినట్లున్నది.

విశ్వా— మహాత్మా! రఘుకులమణివైన నీకే చెల్లునోయి! నేనేదియడిగినను లేదనక యిచ్చెదవు గదా!

దశర— మహాత్మా! మీకాసంశయమేల!

ఉ. సంతతి లేదు లేదని వి ♦ చారము పోయెను యజ్ఞమూర్తిచే
స్వాంతము విస్తరింగ సుము ♦ దాంబుధి నోలలలాడుచుండె ధీ
మంతులు నల్వురాత్మజులు ♦ మౌనివరేణ్యము! కల్గినార లీ
యంతము లేని మోదమును ♦ యాంబున దీర్పవె! మీ యభీష్టమున్.

కావున మీయభీప్సితమును దెల్పెదరేని శిరసావహించి చేసెదను.

విశ్వా— అట్లయిన జెప్పెదవినుము.

ఉ. ఎప్పుడు జన్నముల్ జరుప ♦ నెంచినసప్పుడే దైత్యులెల్లరా
యప్పురవీధినుండి నవ ♦ నోచితవేదిక రక్తమాంసముల్
గుప్పగ జల్లి యజ్ఞమున ♦ కున్ గడు విఘ్నములాచరించె నీ
విప్పుడు రామలక్ష్మణుల ♦ నిచ్చినవారల నోర్తురంతయున్.

దశర— (తనలో) అక్కటా! యీమాట నాహృదయమునకు వజ్రఘాతమువలె దగిలినదే! ఆకుమారులవిడచి నేనెట్లుబ్రతుకుదు? నన్నన్నా ప్రాణము మీదికివచ్చినదికదా! (ప్రకాశము) సంయమీంద్ర!

సీ. సరిగ జాపమునకు ♦ జ్యానల్లి కూర్పగా
బల్మిచాలరు పసి ♦ వారు కారె
బాణసంధానమై ♦ భవము నెఱుంగని
చిఱుతకూనలు కారె ♦ యురయ వారు
లేతమ్మిదూండ్ల బో ♦ లిన భుజాదండముల్
కలవారు సైతురే ♦ కఠినములకు

పిల్లలాటలయందు ప్రీతితో జరియించు
కనుగాయ లేడ రాక్షసుల దేడ

గీ. అక్కటా స్వప్నములనైన నసురరూపు
గనియెఱుంగనివారు రక్కసులభీక
రాట్టహాసములకు భీతి నందరొక్కొ
పుత్రులనువీడి నన్ను గొం పోవుమయ్య.

విశ్వా—ఓయి దశరథమహీపాల! నీవందులకై శంకింపనవసరము లేదు

చ. ఎఱుగవు వారిశక్తుల నొ కించుకయైనను రామలక్ష్మణుల్
దురమున రాక్షసాధముల ద్రుంచుటలద్భుతమో! రాజచంద్రమా
వెరువకుమీవు వీరిబల విస్మృతిధైర్యము నీవశిష్టుడే
యెరుగని శక్తి లేనియెడ నేనటుదోడ్కొని పోదుజెప్పరా.

దశర—మహాత్మా! ఆ రాక్షసులెవ్వరు.

విశ్వా—వారు సుందునకును దాటకిని జన్మించిన సుబాహు మారీచులను వారు రావణునిచే బంపబడినవారు.

దశర—(తనలో) అన్నన్నా ప్రాణసంకటము వచ్చినదికదా! ఏమి సేయుదును! (ప్రకాశము) భగవన్! గాధినందన!

చ. కొడుకులకై తపించి మునికుంజర! మీకృపగాంచినాడ నీ
బడుగుతనాన కీసుతుల వారలబాసిన నాదుప్రాణ మీ
యొడలున నిల్చునయ్య! నను రొక్కెకినేన సమస్త సేనతో
వడిజను దెంచి రక్కసుల ప్రాణములదీసి మఖంబుగాచెదన్.

కావునన న్నొంపొందు యెవరైననేమి మీకుగావలసినది యజ్ఞరక్షణముగదా.

విశ్వా—రాజా! ఆకార్యము నీకొడుకులవలననే కాని నీవలన నగునది కాదు.

దశర—స్వామీ! నాతలంచిన కార్యభార్యమును నాపసికుర్రలు మోయగల్గుదురా! యీమాటచే నాకధికసంతాపము కలుగు చున్నది. యెట్లన ననుగ్రహించి నాపుత్రులవిడచి నన్ను గొం పోవుడు.

విశ్వా—ఏమీ రాజా! నీకు మతిచాంచల్యమా! యేమి నీకొడుకుల నంపెదవా లేదా! తొలుత నావిధంబుగ గోర్కెదీర్తునని యిప్పుడు మారుమాటలాడి రఘుకులమునకపకీర్తి దెచ్చెదవుగా!

దశర—స్వామీ! ఆగ్రహింపకుడు.

ఉ. రావణముఖ్యులైన యసు ♦ రప్రకరంబులు దేవ దైత్యభీ తావహులాహవస్థలు ను ♦ హారధికుల్ కడుమాయకాండ్రు, కా రే వివరింప నాకొమరు ♦ లేడ నధించుటయేడ నత్కృపా భావముతోడ నానుతుల ♦ బాసి ననున్ గొనిపొమ్ము ధీమణీ.

(నమస్కరించును)

విశ్వా—(కోపముతో) రాజా యింకను అదేపదమా నాక్రోధమును మరచితివా!

చ. ఇనకులమందుబుట్టి మద ♦ భీష్టము దీర్తునటంచు జెప్పి నీ తనయులవీడ లేదనుట ♦ ధర్మమె! సూనృతవాదులన్న మీ ఘనతరకీర్తికిక రణి ♦ గల్లవచించి ఖిలంబు సేతువే జనపతి! గాధినందన కృశానుడు దుస్సహుడం చెరుంగవో.

కావున వేగ నీకొమరులబంపుము అస్మదాదుల యజ్ఞసంరక్షణము సేయజాలని మీరాజ్యమేల? మీకేల? నిష్కారణము నాక్రోధానలం బునకు మిడుతవు కాకుము.

వశి—దశరథమహీపాల! నీవు శంకింపవలదు. రామచంద్రుడసహాయ శూరుడు అంతియెకాక యీమహాత్ముని వెంటబంపిన సకల

శాస్త్ర రహస్యముల నేర్పి దివ్యాస్త్రములబడసి లోకరక్షణ సమర్థులగుదురు. కావున బంపుము

దశ—(తనలో) అన్నన్నా! చెడివచ్చినదికదా!

ఉ. ప్రాణసమానులై తనరు ♦ రాముని లక్ష్మణు బాసి యేక్రియన్
బ్రాణమునిల్పుకొందు నటు ♦ పంపక యుండిన గాశికుండునై
శ్వానరుడై దహించు నెటు ♦ సల్పుటకున్ మది దోచదయ్యె. హా
మానుగ ధారుణీగగన ♦ మధ్యమునందున వ్రేలుచుంటిగా.

(ప్రకాశము) విశ్వామిత్రమునీంద్ర! అపరూపముగ గన్నబిడ్డలవిడచి యుండ లేక అట్లుపల్కితి నాగ్రహింపకుడు రామలక్ష్మణుల రప్పించి మీకర్పించెదను.

(రామలక్ష్మణులు ప్రవేశించెదరు.)

దశర—వత్సలార! యీమహాత్ములకు నమస్కరింపుడు

రాము—భగవన్ సాయమీంద్రులార! మాయభివాదనములు స్వీకరింపుడు.

లక్ష్మ—మహర్షులు నాప్రణామముల స్వీకరింతురుగాక!

విశ్వా—రామలక్ష్మణులార దీర్ఘాయుష్మంతులై భూభారహరణ సమర్థులై వర్ధిల్లుదురుగాక!

రామ-లక్ష్మ—మహాప్రసాదము.

దశ—కుమారులార! నన్నొక్కసారి చేరరండు. (కౌగలించుకొని)

చ. గుణనిధులార! పూపకులు ♦ కుంజరులార! మదీయ రామల
క్ష్మణ సుతులార మిమ్ములను ♦ గాధిసుతాను మఖంబుగావ

(దుఃఖించును.)

రాము—తండ్రి సంతోషమునకు మారుగ సంతాపపడెదరేల! అందువలనమాకు గీర్తి లక్ష్మీసమాగమన మగునుగదా!

లక్ష్మ—తండ్రీ ! యింతమాత్రమునకింత కొండలపాటేల వేగజెప్పుడు.

దశర—

నర్పణమొనరించినానుగద ✱ రా ! మిమునిర్వుర బాసినట్టి యీ

క్షణములు కల్పతుల్యములు ✱ కావె! ధరించుటదెట్లుప్రాణముల్.

రాము—జనకా పుత్రవ్యామోహమునం జేసి మమ్ముఁవిడువజాలక మీ రట్లు పలుచున్నారు. కాని నిజముగ నీమునితిలకుని వెంట మమ్ముఁలబంపుట మాకరచేతికి సామ్రాజ్య మందిచ్చుటయని తలంపుడు.

గీ. ఘర్షణో పలనముగాక ♦ కనకశునకు
గురులసేవలచేగాక ♦ కొమరులకును
వన్నెయునువాసి కల్గునే ♦ వసుధలోన
గాన మునిసేవకయి జన * కా ! పనుపుమి

దశ—బిడ్డా ! మిమ్ము విడచియుండలేక పొగలుచుంటినికాని మీరు పోవుకార్యము మహాత్కార్యమని యెఱుంగుదును

లక్ష్మ—తండ్రీ చింతిల్లకుడు. వేగ సంయమీంద్రుని కృపవడసి వచ్చెదము.

దశ—పుత్రులారా !

సీ. సులభంబుగా ధను ✱ స్సున నారికూర్తురే
కలువతూండునుబోలు ✱ కరముతోడ
చరచలమునిబాణ ✱ సమితిగూర్పగలారె
పల్లవంబననొప్పు ✱ పాణితోడ
అతిభీకరంపు మా ✱ యాకల్పనల మాయ
జేయగలారె యో ✱ చిన్నలార
భీభత్సకరదైత్య ✱ వీరులదిలకించి
జడియకుండగ లారె ✱ బుద్ధులార

గీ. సమరరక్కసులైన రాక్ష * సులకృతుల
భంగపడకుండు జేనాయు * నంగులార
తండ్రులార ! సద్గుణమణీ * ధాములార
రామలక్ష్మణులార నా * ప్రాణులార.

రాము—జనకా! ఆవిషయమైనంతయు సంకోచింపకుము.

సీ. కనుమూసి తెఱచినం * తనె పురారాతివిం
టికినైన నారిఘు * టింతుమయ్య
తృటిలోనరవికాంతి * మఱుమాయమైపోవ
జెలగి బాణముల వ * ర్షింతుమయ్య
దూటబిళ్లలరీతి * దుష్టదైతేయ వ
క్త్రంబులధాత్రిపై * రాల్తుమయ్య
భీభత్సకరదైత్య * నీచులరక్తముల్
చిటికెలోబ్రవహింప * జేతుమయ్య
గీ. ఆకటికి నోర్వలేమని * యడలకయ్య
మూలముల మెక్కలేమని * మూల్గకయ్య
మఖము గావగలేమని * మానకయ్య
భవ్యకౌశికముని వెంట * బంపుమయ్య.

విశ్వా—బళిబళి ! రామచంద్ర ! సద్గుణసాంద్ర ! రఘుకుల కమలాకర తరణివన నీవేనోయి నీగుణంబులు శ్లాఘాపాత్రంబులుకదా?

లక్ష్మ—జనకా ! ఇంకను శంకించుచుంటిరా!

గీ. అన్నగారికి భుజ * మైనెలయుచు
సర్వవిధముల యజ్ఞ * రక్షణమునందు
దోడుపడువాడ గాధిపు * త్రుని కరుణను
బడసెదముకాన నికబంపవలయుదండ్రి.

వశి—తథాస్తు! విశ్వామిత్రుని యనుగ్రహమునంజేసి నీ పుత్రులు దివ్యాస్త్రకోవిదులగుదురు. వేగబంపించుము.

దశ—ఓ కౌశికమునీంద్ర!

గీ. సర్వవిధముల బసివాఁడు సకలదైత్య
వీరుల నదేవిధాన జయించునో నేఁడో
నీదెభారముసుమ్మి మునీశ సర్వ
అర్పణము జేసినాడ నా యాత్మజులను.

[పిల్లల కౌశికునకర్పించును]

విశ్వా—రాజేంద్ర! నీకుభద్రమగుఁగాక. నీకుమారులువిజయలక్ష్మీపాణిగ్రహణమహోత్సవ మనుభవించి అచిరకాలముననిన్ను జేరుదురు. మేముపోయివచ్చెదము.

రాము—జనకా పోయివచ్చెదము. వశిష్ఠమునీంద్రా! ఆశీర్వదించుడు.

లక్ష్మ—తండ్రీ పోయివచ్చెదము. ఆచార్యోత్తమ పోయివచ్చెదము.

దశ—శుభములు కలుగుగాక.

వశి—కళ్యాణప్రాప్తిరస్తు.

(అందరు నిష్క్రమించెదరు.)





# సంపూర్ణ రామాయణ నాటకము

## తృతీయాంకము.

1 వ రంగము సరయూనదీప్రాంతము.

[రామలక్ష్మణ విశ్వామిత్రులు ప్రవేశించెదరు.]

విశ్వా—రామభద్ర! ఇదియే యంగ దేశమనబడునది.

రామ—మహాత్మా! అంగదేశమనుటకు హేతు వెయ్యది.

విశ్వా—వత్సా! శంకరుండు పార్వతిని బెండ్లిఁ జూడ నిందుదపము సేయు మన్మథుడాతని బుష్పబాణంబుల నొప్పించె నందులకై శివుడాగ్రహించి తనకంటిమంటచే మదనుని యంగం బిటగాల్చుటచే నిది యంగదేశమనబడినది.

రామ—ఓహో! పుణ్యస్థల సందర్శనంబునం జేసి పవిత్రులమైతిమి కదా! స్వామీ! ఆప్రవహించుతరంగిణి నామమేదియో?

విశ్వా—రామచంద్ర! అదియే సరయూనది అందు గృతస్నాతులై వచ్చితిరేని మీకు క్షుత్పిపాసలు లేకుండ. బల, అతిబల, అను మంత్రముల నుపదేశించెను.

రామ & లక్ష్మ—మహాప్రసాదము: (యిద్దరుగృతిస్నాతులై వత్తురు.)

విశ్వా—(రామలక్ష్మణులచెవిలో మంత్రముపదేశించి) రఘుకులపావనులార! మీరీ మంత్రములను మనస్సుచే జపించుచుండిన

క్షుధయు బిపాసయుగలుగవు. రెండవమంత్ర పఠనమువలన దివ్యాస్త్రములు మిమ్మువరించును.

రామ & లక్ష్మ—ధన్యోస్మి! ధన్యోస్మి!

విశ్వా—వత్సలారా! యీప్రాంతము మలకరూశదేశములని వాడబడుచున్నది యీప్రదేశంబుననే సుందుని భార్యయైన తాటక యను నిశాటి సుబాహు మారీచులను పుత్రులతో స్వేచ్ఛగ సంచరించుచు సకలముని దేవగణంబులకుగూడ దేరిచూడరానిదై ప్రవర్తించుచున్నది. నీవుదానిని సపుత్రగా వధించి యీప్రదేశమును నిష్కంటకముగ జేయుము.

తాటక—(వికృతాకారముతో బ్రవేశించి) అలలలా! అరే దురాత్ములారా! యెవ్వరురావిూరు! ప్రళయకాల భైరవింబోలిన యీగ్రింధిలభ్య కుటిలలాటను యీశోణితసిక్త పటుఖేటను యీతాటకను గాంచిన దేవదానవ మనుష్యకోటులీవనంబునం బ్రవేసింపక తొలగిపోవుచుండ ఔరా! యెంతనిర్భయముగ నావదన గహ్వర విహారమునకు గడంగినారు! రండు రండు మిమ్మందర నాకోరలచే నమిలిభక్షించెదనుగాక! అలలలలా! అరరేరరా (మీదికివచ్చును.)

విశ్వా—రామభద్రా! దీనిను పేక్షింపకుము కోలచేగూల్పుము.

రాము—తమ్ముడా! దీనినిపుడే నాశరమున సమవర్తి కడ కంపెద జూడుమా!

శా. ఓసీ! తాటక నామధేయుని మహా హుంకార మొప్పార నా
పై సంరంభము జూపవచ్చిన భయ భ్రాంతిన్ విడంజూడ, రా
కాసీనామక ఘోర బాణశిఖిద గ్ధంబౌనటుల్ సేతు రా
వే! సుత్రామముఖాది దేవతలకున్ బ్రీతిన్ దగన్ గొల్పనే.

(బాణమువిడువ దాటకి) హాహాహా అరరా (అనికూలును.)

విశ్వా—రామచంద్ర ! జయముజయము. అదిగో సురలు పూలవానల గురియుచున్నారు.

రాము—మహాత్ముల కరుణారస ప్రభావమె. నేనల్పుడను. (శిరము వంచును.)

విశ్వా—మరియు మీకు గొన్ని యస్త్రముల నుపదేశ మొనరించెదను.

రామ_లక్ష్మ—సావధానులము (శీర్ష ములవంచి నిలతురు)

విశ్వా—(వారికుపదేశించును) వత్సలార ! మీరీయస్త్రముల కలిమిచే నాయజ్ఞభంగుల సంహరించుడు. నేనుపోయి యజ్ఞమునకు బ్రారంభించెదను. (నిష్క్రమించును.)

రాము—చిత్తము.

2 వ రంగము—మాతలి వనాంతరము.

రాము—తమ్ముడా ! లక్ష్మణ ! ఆమింటిపై జూడుమా !

గీ. కౌశికుని యజ్ఞకుండ నిర్గతంబయిన
ధూమసంచయమో లేక దుష్టదనుజ
వర్గమాయయొకాని యంబరమునందు
న సమయాంబుద సంచయంబె బా వహిల్లె,

లక్ష్మ—అన్నయ్యా ! అది హోమధూమము కాదు. తప్పక దానవ మాయా వేల్పితకాల మేఘాడంబరమే ! కావున నీవు వాయు మార్గణంబున నీజలధర పంక్తిని దూలించుము. (ఆశ్చర్యము) ఓహో ! అపుడే రక్తవర్షము ప్రారంభించినది చూచితివా ! వేగద్వాఅపముము.

రాము—(బాణమును ప్రయోగించును.)

లక్ష్మ—అన్నయ్యా ! ఆకెవ్వ నొక ఘోరరాక్షసుడుమింటనుండి వికృతాకారముతో ధరిత్రిగూలినాడు. శోణితవర్షము చల్లారినది. మేఘపంక్తి విరిసినది.

రాము — లక్ష్మణా! సుబాహు మారీచులలో వీడొక్కడు కావచ్చును. రెండవవాడిక మన బాణమునకు గురికావలయును.

లక్ష్మ — అదిగో! అదిగో! రెండవవాడును మరికొందరును మరల నంబరతల మాక్రమించుచున్నారు. బాణమును సంధింపుము.

రాము — ఔనౌను. (బాణము సంధించుచు) తమ్ముడ! నా అనిలాస్త్రము మారీచుని సముద్రమధ్యమునకు గొంపోయి పడవైచినదోయి.

లక్ష్మ — ఇక శత్రుని శ్శేషమైనదని తలంపవలసినదే.

విశ్వామి — (ప్రవేశించి) వత్సలార! నానవనభంగులైన సుబాహు మారీచప్రముఖులు హరించినారు. యజ్ఞము పరిసమాప్తిని బొందినది. మిథిలానగరమున జనకమహారాజు యజ్ఞమొకటి జేయుచున్నవాడు. మనమచ్చటికి బోవవలయును రండుపోవుదము.

రాము — చిత్తము.

(నిష్క్రమింతురు.)





శ్రీ

# సంపూర్ణ రామాయణ నాటకము.

## చతుర్థాంకము.



### 1 రంగము.—గౌతమాశ్రమము.

(రామలక్ష్మణ విశ్వామిత్రులు ప్రవేశించెదరు.)

రామ—మహాత్మా! కౌశిక గురువర్యా!

సీ. ఆశ్రమపథముల • యందు మునీంద్రులు
సంచరించిన యట్టి • జాడ లేదు
పూచినయట్టి పూ • వులు కుప్పకుప్పలు
గా రాలె గోసి • న తీరు లేదు
చెట్లమూకల ముని • శ్రేష్ఠులు చేసిన
హోమపుంబొగ పర్వ • యుండ లేదు
పరువుగా బెఱిగిన • పాలాశకుశశుకోన
లెంతయు గోసిన • జాడ లేదు

గీ. వీనులకు నింపుగాల్పెడు • వేదరవళి
సుంతయు బ్రతిధ్వనింప దీ • ప్రాంతభూమి
పాడువడియుండె నే • మునివరుని యాశ్ర
మంబొ! తెలుపవె! • కౌశిక మానివర్య.

విశ్వా—వత్సా! ఇదియే గౌతమాశ్రమము.

రాము—ఆర్యా! ఆ గౌతమఋషి యిందు లేడా! ఆశ్రమము మిట్లుంటకు
కారణమేమి?

విశ్వా—ఆయంశమును తరువాత జెప్పెద.

రాము—ఓహో! ఈశిలమార్గమునకు నిరోధమైనదె. (అందలి రాతిని దున్నును. అహల్య స్త్రీరూపముతో ప్రవేశించును.)

రాము—ఏమి! యీఆశ్చర్యము యీశిల స్త్రీ యెట్లయ్యె (ఆశ్చర్య మభినయించును.)

అహల్య—(ప్రవేశించి) మహానుభావ రామచంద్ర పురాణపురుష!

ఉ. ఈవె సమస్తలోకమున కీశుడవ్రొ రఘురామచంద్ర! నీ
పావన పాదధూళి నిల కంబిటసోకగ శప్తనైన నా
గ్రావపురూపుబాసి యల గౌతమపత్ని నహల్యనైతి నో
దేవ! పవిత్రనైతి బ్రతు కించెదనన్న ననుగ్రహింపుమా.

స్వామి! నీవు జగద్రక్షణార్థంబు దుష్టసంహారము సేయ నవతరించిన ఆదినారాయణుండవు. పరాత్పరుడవు. నీసందర్శనమునకై చిరకాలము నుండి శిలనై తపించుచు నేను నీదర్శనపదస్పర్శనమున పవిత్రురాల నైతిని.

రాము—అమ్మా! నీకు శాపమొసంగిన వారెవ్వరు? నీ వొనరించిన యపచారమేమి?

అహల్య—(తలవంచి యూరుకొనును.)

విశ్వా—రామచంద్ర! యిందు్రిందు కామాతురుండై యర్ధరాత్రిమున గౌతముని వంచ కోడినై కూసెను. తెల్లవారెనని గౌతముడు స్నానార్థమై నదికేగెను. అంతట వజ్రి గౌతమవేషమున నహల్యను స్పృశించెను. తరువాత నెంతకును దెల్లవారలేదని దివ్యజ్ఞానదృష్టిచేజూడ నిందు్రని దుష్కృత్యము తెల్లమయ్యె. వెంటనేవచ్చి ఓరీ శతమఖ! భగలోలుడవై వచించితివి. కావున సహస్రభగుడవు కమ్మని శపించి పాషాణరూపము నొందుమని

యహల్యను శపించెను. అపుడు దేవప్రార్థనచే నింద్రుని సహస్రాక్షునిగ నుండుమని యనుగ్రహించెను.

రాము—ఆహా! కామాంధకారము శతముఖునంతవానిచే గోడివేషమును వేయించినదే అమ్మా! యెరుంగకచేసిన నిన్నేల శపియించెను?

అహల్య—మహానుభావ! నేనేదోషమెఱుఁగనని ప్రార్థించి నాశాపవిమోచన క్రమము నెఱిఁగింపుడన నారాయణుండు రామావతారమెత్తి మిథిలకుబోవుచు నీమార్గమునవచ్చి దనపాదరజంబు సోకించినప్పుడు నీశాపవిమోచనమని చెప్పి తాను హిమవంతంబునకుబోయె నదిమొదలు నేను మీదర్శనమునకై వేచియుండి నేఁడు ధన్యురాలనైతిని. నేను నాభర్త సన్నిధికిబోయెదను. మీకివే సహస్రవందనములు.

రాము—తల్లీ! నీ సందర్శనమున ధన్యులమైతిమి నీవరుగుము.

అహల్య—మహాప్రసాదము.

విశ్వా—రామభద్ర! మనమిఁక మిథిలకు బోవుదము రమ్ము.

(అందరు నిష్క్రమించెదరు.)

---

2 వ రంగము—సభాభవనము.

(జనక శతానందులు ప్రవేశము.)

జనక—గురుపుత్ర శతానంద! ఏమంటివి! సీతాస్వయంవర విషయమై శివధనురారోపణంబు పణంబుగా నేర్పరచుట దుర్ఘటకార్యమనియా! మీతలంపు అట్లైకాక యేమిసేయుమనెదవు

ఆ. వె. పొలతు కలసుగూడి ♦ బొమ్మలపెండ్లిండ్లు
సేయువేళ నిడమ ♦ చేతితోడ

వేయిమందిమైన ♦ మోయజాలని శివ
వింటిలీలనెత్తి ♦ బెట్టె నవల.

అట్టిభుజబలోపేతకు దగిన భర్త యాశివచాపము నెక్కిడిన వాడేకదా యని అట్లు నిర్ణయించితిని.

శతా—ఓహో! ఆలాగునా నేనదియెరుంగక అట్టివరుడునుంభవించుట దుర్ఘటమని అట్లంటిని.

(విశ్వామిత్ర రామలక్ష్మణులు ప్రవేశించెదరు.)

అందరు—(లేచి ప్రత్యుద్ధానమును సేయుదురు.)

జనకు—విశ్వామిత్ర మునీంద్రా! నావందనముల స్వీకరించి యిందు దయసేయుడు బాలకులార! మీరును యీపీఠముల నలంకరించుడు

విశ్వా—ఓవిదేహరాజ చక్రవర్తి! చింతిత కళ్యాణసిద్ధిరస్తు. కూరుచుండుము.

జనకు—(కూర్చుని) సంయమీంద్ర! యీసుందరాకారు లెవ్వరు?

విశ్వా—జనకమహీపాల! అదియే చెప్పెద నాకర్ణింపుము.

సీ. రఘువంశమని దశ ♦ రథ రాజపుత్రులు
రామలక్ష్మణుల పే ♦ ర్వడసినారు
రాముడితండు మా ♦ ర్గంబున నొకకోల
దాటకియనెడు ని ♦ శాటిద్రుంచె
నాయజ్ఞమునకు వి ♦ ఘ్నంబుజేసెడు సుబా
హ్వాదుల దునుమాడి ♦ యలరినాడు
చరణ ధూళీల వ ♦ స్పర్శచేతను శాప
శిల నహల్యనుజేసి ♦ చెలగినాడు

గీ. పిదప నీయింట ద్రి ♦ పురారి వింటినెక్కు
వెట్టి మీపుత్రిసీతను ♦ బెండ్లియాడ
వచ్చియున్నాడు దేవతల్ ♦ మెచ్చునటుల
వేగ శివచాపమిటకు దె ♦ ప్పింపుమయ్య.

శతా—ఓహో! నాతల్లియైన యహల్యకు శాపమును బాపిన మహాత్ముడా! భగవన్ రామచంద్ర! మీపవిత్ర చరణార విందముల కనేకవందనములు (నమస్కరించును.)

రాము—అయ్యా! అహల్యకుమార! లెమ్ము నీవేమాకు వందనీయుడవుకదా!

జనకు—ఓహోహో! ఏమీ నాపుణ్యము! ఏమీనాభాగ్యము. గాధేయమునీంద్రా!

ఉ కేవల పావనుండయిన * కేశవుడే యగుగాని లేనిచో
నావిధిశప్తయైన శిల * నంఘ్రిరజంబున బాతకంబులన్
బోవగజేయునె పురుష * పుంగవు మానవుడంచు నెంతుమే
దైవము నాదు పూర్వసుకృ * తంబున నీగతివచ్చె సీతకై.

విశ్వా—అందులకు సందియమేమి కేవల పరాత్పరుడనియే యెంచదగును.

జనకు—శతానంద! నీవుపోయి శివచాపమును దెప్పింపుమని సేనానికిని సీతను దోడ్కొనిరమ్మని చెలులకును నాఆజ్ఞగాదెల్పుము.

శతా—చిత్తము. (నిష్క్రమించును)

(సీత నందినీలు ప్రవేశించెదరు.)

నందిని—అమ్మా జానకీ, రామా యిటు యిటు.

సీత—(సిగ్గుచే దల వంచును.)

నంది—ఓహో! నీ విప్పుడే వరింపబడితివా!

సీత—(కోరచూపుతో) ఓసీ! ఎవరి చేతనే?

నంది—ఎవరిచేతనా! యిపుడు సిగ్గుచేత.

సీత—తరువాత!

నంది—తరువాత శ్రీరామచంద్రునిచే.

సీత—నందినీ యీ సందిగ్ధసమయమున బరిహసింపకుమా. (పైటచెరగు దుడిచికొనును )

నంది—సీతా నేను వ్యర్థముగ బరిహసించుటలేదు. శ్రీరామచంద్రుని ప్రేమభూషణ పుష్పమాలికల నవరించుకొను చున్నావు. అవి నిరంతరము నీ కంఠము నలంకరించియే యుండునుగాని పోవు నవికావు సుమీ.

సీత.—(రామునివంక జూచును.)

నంది—అదిగో రామచంద్రుడును నీ చూడ్కులనెడు నల్లకల్వల దండను కంధరమున నలంకరించినాడు. అప్పుడే యెంతయురియుచుంటివే !

సీత—(అంగుళిచే బెదరించి) నీ యసంబద్ధ ప్రలాపము లికమానుమా.

రాము—(తనలో) ఆహా! యీజానకీ సౌందర్య మెంత మోహనాకారముగ నున్నది.

మ. బళిరా ! యీ జనకాత్మజాత ఘనసలా • నన్యాంబుపూరంబులో
పల బాహాద్వయితమ్మితూడులుగ శై • వాలంబుగాగొప్పనున్
జలజంబ్బులు మోము నేత్రములు చ • చంన్మీనయుగ్మం బనా
నలరేగా జన్నులు తమ్మిమొగ్గలన మో • హాకారతన్ మించెడిన్

ఓహో దైవమా ! యీ పురంధ్రీరత్నమును నాకు సమకూర్చుమా.
(భటులు శివచాపమును మోసితెత్తురు.)

జనకు—రామచంద్రా !

ఆ. వె. ఈ శివశరాసనవరంబు * నెవ్వ డశ్ర
మమున నెక్కిడు నాగుణ * మండనునకు
నాదుపుత్రిక సీత స * న్మానపూర్వ
కంబుగ నొసంగువాడ లో * కంబు మెచ్చ.

కావున నీవీ శివకార్ముకము నెక్కు వెట్టి నా మనోరథము నీడేర్పుము.

విశ్వా—వత్సా ! రామభద్ర ! వేగ మారోపించుము.

రాము—గురువర్యా ! అభివాదనము సేయుచున్నవాడ.

విశ్వా—ఆయుష్మంత ! అశ్రమమునకు నీవీ హరచాపము నెక్కువెట్టె దవుగాక.

రాము—(ధనుస్సును సమీపించి)

గీ. త్రిపురదానవులను గూల్చి దేవదేవు
డైన శివునకు జయమిచ్చి నట్టిచాప
రాజమా ! జానకీ పరి గ్రహణమునకు
గారణమ ! నీకు నానమ స్కారము లివే

(ప్రదక్షిణ నమస్కారము చేసి చాపము నెత్తి)

గీ. గురువశిష్టుల కౌశికు గురుతరంపు
భక్తిగొల్చితి నేనియీ భవునివిల్లు
సత్రమంబున నెక్కిడి యభి మతంబు
నందువాడను జనకు లా నందమొంద.

(ఎక్కు వెట్టగా ధ్వనితో విరుగును.)

సీత—హా నందినీ (చేటికను కౌగలించుకొనును.)

నంది—జానకీ జడియకుము. నీ యభీష్టలత పుష్పించినది. నీ మనోహరుండు రామచంద్రుండు శివవిల్లు నెక్కువెట్ట నాతని బాహుబలమునకు జాలక విరిగిపోవుటచే గలిగిన ధ్వని కాని యిప్పుడే యుపద్రవమును రాలేదు. కన్నులదెరచి నన్ను విడచి శ్రీరామచంద్రుని గౌగలించుకొనుము.

సీత—(నందిని బుగ్గలు నులుమును.)

జనకు—అమ్మాయీ సీతా ! యీపుష్పహారమును శ్రీరామచంద్రుని కంఠమున నలంకరించుము. (పూలదండ యిచ్చును.)

శతా— రామచంద్ర ! నీవీ పూలదండను జానకీదేవి గళమున నలంకరింపుము. (దండనిచ్చును)

సీత—(రామునకు దండ వేయును.)

రాము—(సీత మెడ పూదండ వేయును.)

విశ్వా—సమస్త సన్మంగళాని భవంతు. (అక్షతలు చల్లును.)

జనకు—కౌశికమునీంద్ర ! భవదీయ కరుణారసంబునం జేసి ధన్యుండనైతిని. త్రిలోకపూజ్యుడు జామాత యైనందులకమితానందమందితిని. మరియు నీ లక్ష్మణునకు మా యూర్మిళను కైకేయీ పుత్రులైన భరత శత్రుఘ్నులకు మాండవీశ్రుతకీర్తులనొసంగి వివాహము సేయదలంచితిని. మీరు దశరథ మహారాజుగారితో విన్నవించి యీశుభముల జరిగించగలందులకు ప్రార్థిస్తున్నాను.

విశ్వా—జనకమహీపాల ! తథాస్తు. అటులేసంధానము చేసెదను.

(అందరు నిష్క్రమించెదరు.)

8 వ రంగము:—కళ్యాణమంటపము.

[దశరథ జనక విశ్వామిత్ర రామలక్ష్మణులు ప్రవేశించెదరు.]

జనకు—విశ్వామిత్రమునీంద్ర ! భవదీయ కృపాకటాక్షమునం జేసి రాజకులచంద్రుడైన దశరథమహారాజుతో వియ్యమందితిని. మహాపురుషులు జామాతలైనవారు మీకు సహస్రవందనములు కాక వేరే యుపకారము సేయజాలను. (నమస్కరించును.)

[తెరలో]

అరే అరే క్షత్రియకుల పశువులారా ! నాదృష్టిపథమునుండి యవలకు దొలగిపొండు.

విశ్వా—ఓహో ! రాజకులమారకగ్రహమైన పరశురాముడు కాబో లు నిటు వచ్చుచున్నాడు. కానీ మంచిసమయమున కేవచ్చి నాడు.

జనకు—కౌశికమునీంద్ర ! అక్కటా మా కపాయసూకదా !

విశ్వా—భయము లేదు. మీరందరు నిర్భీతిగ గూర్చుండుడు.

పరశురాముడు—(ప్రవేశించి) అరే క్షత్రియ పశువులారా !

మ. అవనీనాథ కుమార కంధరసము ♦ ద్యద్రక్తధారాభిషే
కవిశేషోగ్రకుఠారధార నెరుగం ♦ గాలేదె యీమత్తభూ
ధవ సంతానశృంగముల్ మొలిచెనే ♦ తిర్యంబుగా మీకు నే
డవురా నన్గనిమూలలం దడగరా ♦ హా ! యెంత ఆశ్చర్యమో.

సరేకానిమ్ము మదీయక్రోధోద్దీప్త నిశ్వాసమారుతమును వెల్వరించి యీరాజకుల కాంతారమున కుత్పాత జంఝూనిలమును బుట్టించెదను గాక. ఓరోరి రాజులార !

ఉ. భార్గవ రామనామునను ♦ స్వప్నమునందున నైన విన్న స్త్రీ
వర్గములోన దూరియతి ♦ వల్వలెగాజుల దాల్పరే ! భయో
త్సర్గులరాచు నేడు నను ♦ దంబున నన్గనియుక్ జలింపరే
భర్గసమానుడైన బల ♦ వంతుడెవం డిట సాయుమయ్యెడిన్.

సరే తెలిసినది. ఓరీ దశరథ ! యీకుమారు లెవ్వరు?

దశ—స్వామి ! వందనములు వీరు నాపుత్రులు రామలక్ష్మణులను వారు.

పరశు—ఏమీ ! రాముడన నేనొకడనుండ నాకు బ్రతి రాముడొకడు వెలసెనుగా !

దశ—జమదగ్నికుమార ! ఆగ్రహింపకుము. మీ నామముబెట్టిన శ్రేయంబని అట్లుంచితిమి. అంతియెకాని వేరులేదు.

పరశు—ఓహో! కడుయుక్తిగ సమర్థించితివే! సరే అదియటుండనిమ్ము
ఓరీ దశరథరామ!
గీ కార్తవీర్యార్జున భుజోగ్ర • కాననమును
దుంచి తద్రక్తపూరవా • ర్ధులను స్నాన
మాచరించిన మత్కుఠా • రాంచలంపు
బటిమ నెఱుగుడు వేరఘు • వంశపుత్రా.

రాము—భార్గవరామ! చెప్పగా వినియున్నాను. కానినీవు చెప్పవల
సిన దేదో చెప్పుము.

పర—ఏమీ! యీతిరస్కారము! అట్లైనవినుము.

ఉ. శాతకుఠారధార నృప • సంతతినిర్వది యొక్కమారు ని
ర్భీతిగద్రుంచి తద్రుధిర • విస్తృతిచేబితృదర్పణంబు సం
ప్రీతిగజేసినట్టిభృగు • వీరుని రామునిదోఃప్రతాపవి
ఖ్యాతినెఱుంగ రే నృపుల • హా! తలకెక్కెనె! నేడు నేత్రముల్.

రాము—భార్గవ! ధరణీశులకన్నులు తలకెక్కలేదుగాని నీకన్నులు
తలకెక్కినవి

పర—హా హా! ఎందుచేతరా?

రాము—ఎందుచేతనా!

ఉ ఊర్జితమూర్తి నీజనకు • నూరకచంపుటచేతగార్త వీ
ర్యార్జునిమీద గోపమున • నల్లనవాని వధింపవచ్చు జ్ఞా
నార్జనలేక యీనృపుల • నందఱివై బగబూని వీరలన్
భర్జనసేయబూనుటధ్రు • వంబుగ నీతలకెక్కె నేత్రముల్.

పర—ఔరా డింభక! ఏమిరా కండక్రొవ్వు.

విశ్వా—భార్గవ రామ! సత్యముపలికిన నీశ్రీరామునిపై నేలయాగ్ర
హించెదవు? ఈతడు పాదధూళిచే శిలయైనయహల్యా శాపవి
మోచన మొనరించిన పరమపురుషుడు. శివచాపము నెక్కు

వెట్టి సీతను పరిగ్రహించిన పరాక్రమధనుడు. అట్టి రాముని నీవు అల్పునిగ దలంచి పలుకరాదు.

పరశు—ఏమీ విశ్వామిత్ర! అహల్యాకర్మ పరిపక్వమైన సమయమున శ్రీరాముడచ్చటికి బోయియుండనోపు అంతమాత్రమున నీతడు ఘనుడెట్లయ్యె వీనిబలముచూచియేనా యీరాజులింత నిర్భయముగనున్నారు. సరేయగుగాక యీరాముడిప్పుడు నాకుశత్రువుడైనాడు. యేమందువా! నాగురుండైన శివునివిల్లెక్కువెట్ట జాలక విరచుటచేత ఓరీ దశరథరామా!

చ. యుగములు సెల్లగాజివికి ♦ యుక్కరియున్న పురారిచాపముం
బగులగ జేయగాను నొక ♦ పౌరుషమే రఘువంశపుత్ర! యీ
భృగుకులరాము చాపమును ♦ వీసమునైనను నెక్కువెట్టినం
జగములు సిన్నురాముడను ♦ జంకిన భార్గవదానుడందు వే.

రాము—ఏమీ భార్గవా అలాగునా!

శా. ఏదీ! యిర్వదియొక్కసారి వని క్ష్మాభృద్విశావళిం ద్రుంచి, మ
ర్యాదంగొన్న త్వదీయకార్ముకము గం క్షాదారంగ వీక్షింతు
(చేతిలో ధనువులాగికొని)

నాహా! దుస్సాధ్యమె దీని నెక్కుడుట రామా క్ చూచెదాగాక నీ
నాదర్పంబుల వెంపు మగ్గుడు జనా క్ నందంబు వాటిల్లగం.
(ధనుస్సు నెక్కిడి బాణము సంధించును.)

పర—(ఆశ్చర్యవిభ్రమముతో) ఆహా ఆశ్చర్యముగనున్నదే!

గీ. ధనువుతోడనె నాశక్తి ♦ దస్కరించె
నీతడెవ్వడో మది ♦ కొరకబడదు
శ్రీరమేశుని యపరావ ♦ తారమనుచు
దలపవలె లేకయున్న నీ ♦ దర్పమేడ.

అయిన గొంతవఱకాలోచించెదను.

రామ—భార్గవరామా ! నీచాపము నెక్కుపెట్టితి నీబాణము నెచ్చట
విడువవలయునో చెప్పుము. యేమందువేని

గీ. అస్మదాచార్యుడౌ కుశి కాత్మజునకు
బాంధవుండవు మఱియును బ్రాహ్మణుండ
వగుట నినుజంపఁ నీ యమోఘాస్త్రమెచట
విడువవలయునో! చెప్పుమీ వేగనాకు.

పరశు—రామమూర్తి ! నీయిచ్ఛయున్నచోట విడువుము.

రామ—భార్గవ ! నీనిమిత్త మెక్కుపెట్టిన వైష్ణవబాణము నట్లువిడు వరాదు. నీపాదగమనశక్తినిగాని నీచిరతపస్సంపాదితమైనపుణ్య లోకప్రాపణశక్తినిగాని త్రుంపవలయును, నిందు దేనినిభంజింపు మనెదవో చెప్పుము.

పరశు—రామచంద్ర ! నాపుణ్యలోకము భేధించుము.

రాము—(బాణమును బ్రయోగించును.)

పరశు—(చూచి) ఆశ్చర్యమాశ్చర్యము. ఆహా దేవా ! ఆదినారాయణ! లక్ష్మీకళత్ర ! (నమస్కారముతో)

గీ. తెల్విమాలి మీనిజస్థితి • దెలిసికొంటి
భూభరము మాన్పనరుడవై • పుట్టినట్టి
విష్ణుదేవుడ వీవుకావే • మహాత్మ
రక్షణముసేయుమయ్య శ్రీ • రామచంద్ర.

స్వామి ! పురాణపురుషుండవై నీవు నేనోడుట లెక్కలోనిదికాదు. దురహంకార వశుండనై నిన్నునిరాకరించిననాయపచారమును మన్నింపుము. నీవవతరించువరకే నాప్రభావముకాని తరువాత నేనీప్రదేశమున నుండరాదు. నాకు శలవొసంగితివేని సముద్రమధ్యమునకు బోయి తపోనిష్టతోనుండెదను.

రామ—భార్గవరామ ! మంచిది అటులేపొమ్ము.

పరశు— మహాప్రసాదము.

(నిష్క్రమించును.)

దశర— ఆహా ! యిప్పటికిగదా ! పులినోటి మాంసశలములవలె బయలుపడితిమి.

జన— యింతకును నాయదృష్టము మంచిది రమానాధు డల్లుడై రాచకులమునకున్న యాపద నివారణచేసినాడు.

విశ్వా— అందుకు సందియమేమి యిక దశరథాదుల నయోధ్యకు బంపుదము లెండు.

(అందరు నిష్క్రమించెదరు.)





శ్రీ

# సంపూర్ణ రామాయణ నాటకము

## పంచమాంకము.

### 1 వ రంగము—పుష్పవన ముఖద్వారము.

[మందర ప్రవేశించును)

మందర—ధరాతలంబున దాస్యవృత్తికన్న దుర్భరమైనదే కాని నాదాస్య మట్టిది కాదు నేను అధిపులకంటె నధికురాలను యేమందురా! మా కైకేయీదేవికి నేను పుట్టినయింటి దాసినగుటచే నాచెప్పినట్లా కైకేయి వినుచుండును. ఆమె యెట్లు చెప్పిన నదే ప్రకారము నుగుదాటక దశరథమహారాజు గారు వర్తించుచును. అందుచే నయోధ్యాపుర సామ్రాజ్యమంతయు నాచిటికెనవ్రేలి గోటిపై నల్లల్లాడుచుండును. కావున జన్మయున నాదే జన్మకాని యొరులు నాకు సాటివత్తురా! యిప్పు డీయుద్యానవనమందలి పుష్పములను గోసికొనిపోయి మాదేవికి మనఃప్రియము గావించెదగాక!

వనపాలకుడు—(పూలగంపతో ప్రవేశించును)

మందర—ఓరీ! పుష్పము లెక్కడికిరా కొంపోవుచున్నావు?

వనపా—(కోపముతో జూచి) పట్టణాలంకారమునకు.

మందర—ఇప్పుడు పట్టణాలంకారమేమిరా!

వనపా—అదిగో పలుసార్లు ఓరీయని పిలుచుచున్నావు. నీయంతదానవు నీవు. నాఅంతవాడను నేను. నీవమ్మగారిదాసివి. నేనయ్యగారి

దాసుడను. ఇప్పటికి క్షమించితి నింకెప్పుడు నన్ను నోయని పిలువకుము.

మంద—ఏమిరా ! ఆపాగకు మా దేవితో జెప్పి నిన్నేమిచేయించెదనో చూడుము.

వన—ఓసీ ! మా అయ్యతో జెప్పి నిన్నేమిచేయించెదనో చూడుము.

మంద— పండ్లు రాలగొట్టెదను సుమీ !

వన— లెంపలు వాయగొట్టెదను సుమీ !

మంద—ఓరికుంకా ! నీకెంత కావరము రా ?

వన—ఓసిలంజా ! నీకెంతమదమే ?

మంద—(తనలో) కడవయంత గుమ్మడికాయ కత్తిపీటకు లోకువన్నట్లు మగవెధవకు నేను చాలనిమాట నిజమే వీనిని శాంతముచే లోంగదీసి తరువాత వీనిభరతము పట్టెదను. [ప్రకాశము] వనపాలక ! నిన్ను నేనోరీయన్నందులకు నీవు నన్నోసీయని బదులు దీర్చితివి మానమీాసాగతి నిక మరచిపోవుదము కాని పట్టణాలంకారమునకు హేతువేదియో చెప్పుమా !

వన—అట్లు తిన్నగమాట్లాడిన జక్కగ జెప్పకపోవుదునా ? రేపటి దినమున బట్టాభిషేకము.

మంద—ఎవ్వరికి ?

వన—రామచంద్ర మూర్తిగారికి.

మంద—ఏమీా రామునకు బట్టాభిషేకమా ! రేపే !

వన—అవును. యెన్నిసార్లు చెప్పుమనెదవు. రేపే రామమూర్తికి బట్టాభిషేకము.

మంద—ఆలాగునా ! సరే నీవుపొమ్మా.

వన—పోవక నీవుండుమని బ్రతిమాలిన నుందుననుకొంటివా? (నిష్క్రమించును.)

మంద—ఈవార్త నాకాశ్చర్యముగనున్నదే. మా దేవికుమాళ్లు భరతశత్రుఘ్నులూరలేని సమయమున రామునికి బట్టాభిషేకము సేయనిర్ణయించుట వృద్ధరాజేదో కపటోపాయము దలంచెనని యూహించెదను మా దేవిగారికీకార్యమునందలి కపటము నెఱింగించి తంత్రములనుబన్ని రామునకు రాజ్యపట్టాభిషేకము కాకుండ జేసి యావరాజ్యపదవిని భరతునకిచ్చునట్లు చేసెదను. అట్లుసేయకున్న నాపేరు మందరకాదు మందరయనయేమో అనుకొనుచున్నారు కాబోలును. మందరనగంబు పాలసంద్రము నెట్లుమథించునో నేను తంత్రముబన్నిన వారిహృదయములట్లు హల్లకల్లోలముగ గలంగిపోవును. ఔరా మాకైకేయీ పుత్రునకుగాక రామునకు రాజ్యపట్టాభిషేకమా! నాప్రభావమును లోకమంతా విలోకించుగాక! (నిష్క్రమించును.)



2 వ రంగము—కైకేయిమందిరము.

[కైక శయనించి ప్రవేశించును.]

మందర—[ప్రవేశించి] అమ్మా కైకేయీ దేవి! నిద్రించుచుంటివా!

కైక—(లేచి) మందరా! వచ్చితివా! యిప్పుడే పండుకొంటిని. అంతలోనే నిద్రపట్టినదే.

మంద—అహహా! (నవ్వి) బాగుబాగు.

కైక—ఏమే అట్లు నవ్వుచున్నావు. కారణమేమే.

మందర—ఏమియులేదు. నీకు నిద్రయెట్లు పట్టుచున్నదో అని నవ్వ వచ్చుచున్నది.

కైక—నిర్విచారము గలదానికి నిద్రసుఖముగ బట్టకమానునా! నవ్వనేల!

మంద—ఓహో! నీకునిర్విచారమా!

కైక—అదేమే అట్లుపల్కెదవు.

మందర—ముందున్న మునుళ్ళపండుగ దలంపక నిర్విచారమనుటచే నాకు నవ్వువచ్చుచున్నది.

కైక—ఏమే ! ఆమునళ్ళపండుగయేదే.

మందర—ఏదియా ! దాస్యము.

కైక—దాస్యమెవరికే.

మందర—ఎవరికో అయిన నాకీబాధయేల ! నీకే.

కైక—నాకుదాస్యమేమే ! ఎవరికిసేయవలయును?

మందర—ఎవరికా ! కౌశల్యకు నీవేసేయవలయును.

కైక—కౌశల్యకేమి నేనుదాస్యము సేయుటేమే !

మంద—ఆలాగునా ! రామునకు రాజ్యపట్టాభిషేకమగుచుండగా రాజమాతకు కౌసల్యకు నీవుదాస్యము సేయవలదా !

కైక—ఏమీ నా రామచంద్రునకు రాజ్యపట్టాభిషేకమా ! ఆహా ! ఎంతచల్లనిమాటచెప్పితివే ! మంచిది. యెప్పుడు?

మంద—(పలుకకుండును.)

కైక—ఎమే పలుకవు !

మందర—(తనలో) రాముడన్న నీమె కెంతప్రియమో, నామంత్రాంగము సాగు టెట్లోకదా ! అయిన బురెక్కించెదను. (ప్రకాశము) యెప్పుడైననేమి నీతలమీద దాస్యదేవత అధిష్టించుటరేపే.

కైక—నీవట్లుతలంచితివి కాని నాకట్టి యమర్యాద జరుగదుసుమీ !

మంద—చాలుజాలు. దెల్లనివన్నియు బాలనియు నల్లనివన్నియు నీళ్ళనియు దలంచు నమాయుకురాలవు. అట్లు గాక యెట్లు తలంచెదవు. ఆవృద్ధరాజు కపటోపాయ మెరుంగని గోలవు. యిన్నిమాటలేల నీ కుమారులు భరతాదులు మాతుల గృహమున

కేగ జూచి రామునకు రాజ్యమర్పించుట నీ తలమీద బుర్వు లను బూజించుట కనుకొంటివా! బొగ్గులను బోయుట కనుకొంటివా! భరతాదులున్న సమ్మతింపరనియు సర్వరాజ్యమును రామున కర్పింపవలెననియు నీ మిథ్యాప్రియభర్త యిట్లేర్పర చినాడు. యిప్పుడైన గొంచెము తెలివితెచ్చుకొని నీ కొడుకు నకు రాజ్యము వచ్చు నుపాయ మాలోచింపుము. లేకున్న నీవు కౌసల్య పాదసేవ జేయవలసినదే. ఆ విషయమున నీకభిమానము లేకున్న నేనుమాత్రము నీ పాదసేవ సేయజాల. నేను చిరకాలమునుండియు కేకయ రాజకులమున మర్యాదగ బ్రవర్తించినాను. అందుచే నా కభిమానముగ దోచినది. యిపుడైన నీ మగడు పన్నిన మాయాతెరను అవలకు దొలగించి నీ కొడుకునకు రాజ్యము వచ్చునట్లు చేసికొనుము. యిప్పుడు నామాట వినకున్న గౌసల్య సేవ సేయునాడైన నామాటలు నీకు రుచింపకపోవు. ఆపైన నీ యదృష్టము.

కైకేక—(తనలో)ఓహో! యీమందర చెప్పినమాట సత్యముగ నేతోచు చున్నది. లేకున్న భరతాదు లింటలేకున్న నీ శుభకార్యమును నాభర్త తలపెట్టునా! యిందులకుపాయ మేదో మందర నే యడిగెదనుగాక. (ప్రకాశము) మందరా! అటులైన నన్నిప్పు డేమి సేయుమనెదవు?

మందర—నీకు తిక్క తిరిగిన నుపాయము చెప్పెదను.

కైకేక—తిరిగినది. నీవు చెప్పినట్లు చేసెదను,

మందర—అటులైన జెప్పెదవినుము. శంబర యుద్ధమున నీభర్త నీకు రెండువరంబు లొసంగి యున్నాడని చెప్పితివికదా! వాటినిప్పు డడిగి పుచ్చుకొనుము.

కైక—ఔ నప్పుడావరములను నాయిష్టము వచ్చినప్పు డడిగెదనని చెప్పియుంటిని.

మంద—అట్లయిన భరతునకు యౌవరాజ్య పట్టాభిషేకమును రామునకు బదునాల్గేడు లరణ్యవాసమును యేర్పరచుమని రెండు వరములను కోరుము.

కైక—అక్కటా! రామున కరణ్యావాస మెట్లు కోరుదునే?

మంద—అట్లు సేయకున్న ననేకాపాయములు తటస్థించును. నామాట వినుము.

కైక—మందరా! మంచిమాట చెప్పితివే. అదుగో నా నాథుండు వచ్చుచున్నట్లున్నది. నీ వావలకు దొలంగుము. ఆ రెండువరంబుల నడిగి పడసెదను.

మంద—మంచిది. పప్పులో నడుగు వేయకుమా! బహు భద్రము.

కైక—నా నాథుండు వచ్చువర కలంకారశూన్యనై దైన్యదశతో నుండెదను. [అట్లు సేయును.]

దశరథుడు—[ప్రవేశించి] ఏమిచెప్పుదూ కైకమందిరము నేడింత శోభావిహీనమై యున్నది!

సీ. కనఁగాంతిగేక భంగి ♦ కలు చేతులను సాచి
యెంతయు స్వాగతం ♦ బీయవయ్యొ
ముంగిట మందర ♦ ముదమారగా నిల్చి
యుచితక్రియల బాద్య ♦ మొసగదయ్యొ
వచ్చితిరాయని ♦ హెచ్చినముదమున
జెలికైక యెదురు ♦ వేంచేయదయ్యొ
పరిభవసర్వము వీడి ♦ బంధితకవాటమై
నిలయంబు కనులింపు ♦ నింపదయ్యొ

గీ. మనను స్వస్థత లేదేమొ ♦ మగువకైక
కే విచారమొ కాని యీ ♦ యెడలనిట్లు
మంగళ విహీనమైన యీ ♦ మందిరంబు
గాంచినంతనె నామది ♦ కంపమెత్తె.

అయిన సమీపించి కనుగొందును గాక. [సమీపించి] ఇదిగో నిక్కడ నలంకారశూన్యయై శయనించియున్నది. కారణమేమి చెప్పుమా! ప్రియురాల! కేకయరాజనందని! కైక! ఆవిధంబుగ సొబగుదూలి విచారముతో నుంటివేమి!

కైక—[లేచి] ఓహో విచారమేమనియా! పాపము మీకు దెలియదు కాబోలును. మీ ప్రియురాలు కైకి కాదు కౌసల్య ఆమె కడకే పొండు.

దశర—ఏమీ! నీవు మాత్రము ప్రియురాలవు కావా! యీనాడేల యిట్టి యాగ్రహావేశముతో నుంటివి దేవీ!

కైక—నేనే ప్రియురాలనైన నన్నింత చిన్నచూపు జూతురా!

దశర—నిన్నేమి చిన్నచూపు చూచితిని.

కైక—చూడకయేయున్న నేనాటి శంబరయుద్ధము యేనాటి వరములు యిప్పటికైన నీయగల్గితిరా!

దశర—వెర్రిదానా! అందులకా! యీచింత. అవసరమున్నప్పుడడిగెదనని నీవు చెప్పలేదా! యిప్పుడడుగు మిచ్చెదను.

కైక—అటులైన దప్పక యిప్పుడిచ్చెదరా?

దశర—ఆ తప్పకయిచ్చెదను.

కైక—ముమ్మాటికి నిచ్చెదనని నాచేతిలో జేయివేయుడు.

దశర—ఆ తప్పక వేయిసారులకు నిచ్చెదను.

కైక—అటులైన భరతునకు యౌవరాజ్య పట్టాభిషేక మొకటి రెండవది రామునకు బదునాల్గేడు లరణ్యావాసము.

దశర—హా! మందభాగ్యుడను కదా! దేవీ!

గీ ఆత్మసుతునకు యౌవరా • జ్యంబు గోర
వచ్చు నా వరమేనీయ • వచ్చుగాని
రాము బదునాలుగేడు ల • రణ్యమునకు
బంపుమని కోరదగునె య • ప్రాజ్ఞురాల.

కావున రెండవ వర మేదేని కోరుకొనుము.

కైక—నాకట్లు వలనుపడదు. రఘువంశపు రాజు లాడినమాట దప్పువారుకారు. నాకా రెండువరంబుల నొసంగుడు. లేదేని ఆత్మహత్య జేసికొనియైన ప్రాణంబుల బరిత్యజించెను.

దశర—అక్కటా! నాప్రాణము మీాదికి వచ్చినదికదా! కైకా.

చ. కరముల బట్టువాడ గుతు • కమ్మున సర్వధరాధిపత్యమున్
భరతున కిచ్చువాడను కృ • పామతివై మునిలోకపూజ్యుడై
వరలెడు రామచంద్రగుణ • వంతుని గేహమునందు నింతయో
గిరిమిడినిల్ప వేడెదను • గిన్కనరణ్యముపాలు సేయవే.

కైక—కరములుకాదు పదములబట్టినను నేనందులకు సమ్మతించుదానను కాను. నాకుమాళ్లు భరతశత్రుఘ్నులు పురమున లేని సమయమున యౌవరాజ్యము రామునకొసంగి నాబిడ్డలకు మనువృత్తియిచ్చి నన్ను మీాప్రియురాలి కౌసల్యకు దాసినిగా జేయదలచితిరా! మీాకీన్యాయము తగదు. మాటదప్పకుంటిరేని నాకా రెండువరముల నొసంగుడు.

దశ—నన్నుబోలిన నిర్భాగ్యుడు లేడుకదా! కేకయరాజనందని భరతుడుమాత్రము నాకొమరుడుకాడా! నీవుమాత్రము నాప్రియురాలవుకావా! యౌవరాజ్యాధికారము రామునిదగుటచేతను హఠాత్తుగ మంచిముహూర్తముతటస్థించుటచేతను యీకార్యముదలచితినికాని భరతాదులపై బ్రేమలేక కాదు. అనుగ్రహించి రెండవవర మేదేని కోరుకొనుము.

కైక—మీ ప్రార్థనలు నా చెంతబనికిరావు. భరతునకు యౌవరాజ్య మిచ్చితీరవలెను. రామునిని వనవాసమునకు బంపితీరవలయును. లేకున్న నేనువరముల నీయలేదని బొంకుడు.

దశర—హా రామ చంద్ర! సుగుణసాంద్ర! [మూర్ఛిల్లును.]

రాము—(ప్రవేశించి) జనని! కైకమాంబ! నీవు మాతండ్రిగారిని గోరినవరముల వినియున్నాను. అందులకై నీవు సంశయింపకుము. నే చెల్లించెదను.

చ. అనుపమ యౌవరాజ్యము స ♦ మస్తముతమ్ముఁడె యేలుగాక! యో
జననిరో నీయభీష్టముగ ♦ జయ్యన గానలకేగువాడ నా
జనకునియాజ్ఞ బన్వ శిర ♦ సావహించుచు దీర్చివేయుగా
దనయుడనైననాకు దగ ♦ దా! మదిశంకను వీడుమమ్మరో.

కైక—రామభద్రా! ఎట్లైన నీవు సకలగుణాభిరాముడవూయి నీయోగ్యత మెచ్చదగినదే.

దశర—[లేచి] హా రామ! హా రామ! (కౌగిలించుకొని విచారించును.)

రాము—జనకా! ఏల మీకీవెర్రిశోకము. సమాశ్వసిల్లి యొకసారి నన్ను జూడుడు.

దశర—వత్సా! నిన్ను వనములపాలుచేసి నేనెట్లుబ్రతుకుదునోయి!
[విచారించును.]

రాము—తండ్రీ! నామాటవినుడు యిందు దుఃఖింప గారణమే లేదు.

చ. పారిబోరి బోర్లుశోకమును ♦ బుక్కిటబట్టుము పుత్రులెప్పుడున్
గురునిఋణంబు దీర్చుట కె ♦ కుంభినిలో జనియించుచుంట బా
మరుని విధానశోకమున ♦ మ్రగ్గకుమయ్య ధరాతలంబు నా
భరతుడె యేలు నేను వన ♦ పాలనసేతు జగంబు మెచ్చగన్.

దశర—ఓసీ! పాపాత్మురాల! కైక నాకుమారుడు రామచంద్రునకెంత ఘాత దలచితివే.

రాము—జనకా! మాతల్లి కైకమాంబపై నాగ్రహమును విడువుడు. ఆమెకిచ్చినవరంబులు చెల్లించుట మీకును మీతనయులమైన మాకును విధికృతము. నేను సంతోషముతో సర్వరాజ్యమును భరతునకిచ్చి నేనరణ్యావాసమునకు బోయెదను. మరియు మీఋణము దీరినదని సంతసిల్లుడు.

దశర—అక్కటా! రామభద్ర! నిన్నువిడచి యెక్కడిదయ్యైన ప్రాణములతో మనజాలుదునా!

రాము—తండ్రీ! యూరడిల్లుడు.

చ. జనకుఋణంబుదీర్చి బుధ ♦ సంతతి మేల్బళియాచు మెచ్చ గీ
ర్తిని దశదిక్కుల న్నిలిపి ♦ ధీరత తేజము గాంచినప్పుడే
తనయుడు కాని యూరక వృ ♦ థావచనంబుల బల్కుచుండి చెం
తను వసియించినంత నె సు ♦ తప్రవరుండె! వచింపుమార్యుడా.

దశర—నాయనా! రామున కరణ్యావాసమను నక్షరములే నాహృదయమును గాల్చుచున్నవోయి యీమాటవిని కౌసల్యమాత యెట్లు జీవించునోయి.

కౌసల్య—(ప్రవేశించి) హాకుమార! రామభద్ర! (కౌగలించి యేడ్చును.) బిడ్డా! నీకరణ్యావాసమను మాట నాహృదయము భేధించుచున్నదిరా నాయనా!

రాము—జననీజనకులార! నాజనయిత్రి కైకమాంబ యీవిషయమున నాకు మహోపకారమే చేసినది యేమందురా!

చ. కొమరునికంటె నాయెడల ♦ నూరిమి హెచ్చయినందు చేతనే
యమిత సమస్తరాజ్య భర ♦ మాత్మజుమస్తకమందుబెట్టి, శాం
తమగు నరణ్యపాలన వి ♦ ధానము నాతలమీదబెట్టె గై
కమ సుతుకంటె నన్ను నధి ♦ కాప్తత జూచుటగాదె! యెంచినన్.

కావున మీరీవిషయమై విచారింపవలసిన యవసరము లేదు.

దశర—హాకుమార ! నీసుగుణంబులు సంస్తవనీయంబులుకదా ! నాయనా !

ఉ. ప్రాణములైదు రామమయ ♦ భావము లౌట నమక్ర ద్యజించియా
కానలకీవు వ్రోవ గోడు ♦ కా యికతుచ్ఛములైన ప్రాణముల్
మేనవసించునే యకట ♦ మేదినితో బనియేలనాకు, కు
రాా ! నినుజూచు భాగ్యమిక ♦ రా దిదియేకడసారియే జమీా.

రాము—జనకా ! అట్టి యమంగళముల బలుకకుము. పదునాల్గేండ్లు బదునాల్గు గడియలలో గడపివచ్చి మరల నినుగాంచెను.

కౌసల్య—అమ్మా ! కైక.

ఉ. పట్టము నీకుమారునకె ♦ ప్రాభవలీలల గట్టవచ్చు నా
పట్టిన భీకరాటవుల ♦ పాలొనరింపక యింటివట్టునన్
బట్టెడు ముద్దబెట్టుచును ♦ బాలనసేయగదమ్మ జ్యేష్ఠుడై
పొట్టకు జాలినంత సిరి ♦ బొందగ జాలడె కేకయాత్మజా.

తల్లీ ! కటాక్షముంచుము నీచరణంబులకు మ్రొక్కెదాన.

కైక—కౌసల్యా ! నీయిచ్చకముల కేమిలే. యేనాడో నాభర్త నా కిచ్చిన వరముల నీనాడు నేను పుచ్చుకొనుట దప్పా. నాకొడుకులు పురమున లేనిసమయమున నీకొడుకునకు రాజ్యాభిషేకము సేయించుకొనుటకు సిద్ధపడితివా లేదా ! యెవరిలబ్ధి వారు పోగొట్టుకొందురా ! కావున దప్పక రాముడడవులకు బోవ వలసినదే.

దశర—హా రామచంద్ర ! నీకెంతగతి పట్టినదిరా ! యీ రాకాసి కైక యీరవికుల కాననకుఠారి యీపాపాత్మురాలు హా తండ్రీ ! హాకుమార నీపాలింటికి మహామారి మహామారి హా రామ హారామ హారామ (మూర్ఛిల్లును.)

కౌసల్య—హా! యెంతనిర్దయురాలవమ్మా భర్తగారి కెట్టి శోకమును బుట్టించితివమ్మా!

రాము.—తల్లీ! నీవు కైకమాంబను నిందింపవలదు. ఆమె యిట్టిపట్టు పట్టకున్న దండ్రిగారి ఋణవిముక్తియేకాదు అమ్మా కైకమాంబ నేను తప్పక అరణ్యావాసమున కేగెదను. నీవు శంకింపకుము.

కైక—అటులైన సరియే యితరుల మాటలతో నాకేల?

సీత—(ప్రవేశించి) హా ప్రాణేశ్వర! (పాదములబడును.)

రాము—(లేవనెత్తి) దేవీ జానకీ! ఏల శోకించెదవు? యీశరీరంబులు నీరాజ్యంబులు నీయఖిల భోగంబులును అతి చంచలంబులు. ప్రాజ్ఞులు వాటికై మురిసి యానందింపరు. అంతియెకాక యీ కైకమాంబ నాకు గడుమేలు చేసినది యేనుందువా!

గీ. అధికచంచలమైన రా ♦ జ్యరమయెల్ల
గన్నకొమరునిపై బెట్టి ♦ కరుణలేక
శాశ్వతంబైన సాధుర ♦ క్షణయశోర
మాధిపత్యమునాకిచ్చె ♦ నాదరమున.

కావున నీవింకులకై నుంతయు విచారింపకుము. పదునాల్గేడులునన్ను విడచియుండ వలసి వచ్చినదని విచారింపకుము.

సీత—హానాథ! భర్తృవియోగ సంతాప మధిక దుర్భరముకదా!

సీ. ప్రాణేశ మనచెల్మి ✠ భవునిచాపమో
వణమునకైతి ✠ రిగినన్నాళ్ళులేదు
మనపెండ్లి మంగళ ✠ ధ్వనులుకర్ణములందు
మలయుటలిం ✠ కను మానలేదు
మనముకట్టినయట్టి ✠ మధుపర్కముల బ్రహ్మ
ముడియీన ✠ వాలింక సడలలేదు

సిగ్గు హెచ్చౌటచే సిరిమించు మీ మోము
సరిగగండ్లార గాంచంగ లేదు

గీ. కటకటా మనయిర్వురి కలయికలకు
నంతరాయము కల్గె నే యింతలోన
నాథ ! మిమ్ము నెడ విడ చి ప్రాణముల నిలుప
జాల ననుగూడ గొం పొండు నరగవనికి.

రాము—బేలా ! మైథవి ! శిరీషకుసుమ కోమలివైన నీకరణ్యసంచా
రము కడుదుర్భరముకదా !

సీ. లలితాంగి ! పూవు రేకుల ♦ బాదమిడ లేవు
కరకు రాల్త్రోవల ♦ దిరుగగలవె
జాబిల్లికళల కే ♦ సై చినిల్వగ లేవు
మిడిమెండలకు నోర్చి ♦ నడువగలవె
పులుగుల గజిబిజి ♦ పలుకు లేవిన లేవు
పులుల బొబ్బలకెల్లు ♦ నిలువగలవె
సురటి వీవనల కే ♦ సొక్కకుండగ లేవు
ప్రబల వాయువుల కో ♦ ర్వంగగలవె

గీ. అక్కటా రాక్షస ♦ ప్రచారార్హమైన
నడవి యెక్కడగల ♦ హంసయాన వేడ
సంచరించుట లదియేల ♦ స్వప్నవార్త
వినుము నా వెంట రాకుమీ ♦ వనజగంధి.

సీత—జీవితేశ్వర మీరట్లనిన నేనేమందును.

చ. సతులకు మేనిచందనపు జచ్చయు గన్నులకున్ సుధాంజన
స్థితియును నాత్మకాత్మయయి చిత్తసరోజ కుటీర వాసియౌ
పతి నెడబాయుకంటె దమ ప్రాణము వీడుట మేలు కాదె ! దు
స్థితిబడి మీరు కానల గృ శింపగ నిటను నే సుఖింతునే.

కావున బాలినేశ్వరా! సుఖమో కష్టమో మీరెందున్న నేనం దేయుం డెదను. నారాక కంగీకరించువరకు నేను మీపాదముల విడువజాల.

(పాదముల బట్టుకొనును.)

రాము—ప్రేయసీ! నీరాక కటులే సమ్మతించితిని లెమ్ము.

లక్ష్మ—(కోపముతో బ్రవేశించి) ఔరౌరా! రఘుకుల చూడామణి యైన శ్రీరామమూర్తికి అరణ్యావాసమా! ఆహా! ఎంతటి చెడుకాలమువచ్చినది. అన్నయ్యా రామచంద్ర! మీకి దేమివెఱ్ఱి

చ. ముసలితనంబుచేత మతి ♦ పోయెనొ కైకమ దుష్టతాంత్రిక
వ్యసనముచేతనో గురుడు ♦ ప్రాజ్య ధరాధిపతిత్వమెల్ల కై
కసుతునకిచ్చుగాక నిను ♦ గానల కేగుమనంగ నెవ్వడీ
రసికుడు నీవు పోవ సగరా యె ♦ వ్వరైనను విన్న రమ్మికన్

(చేయి పట్టుకొని లాగును)

రాము—తమ్ముడా యిది గుర్వాజ్ఞకదా! చెల్లించుట నాకు విద్యుక్త ధర్మము. కావున నాకడ్డు పెట్టకుము

లక్ష్మ—అన్నన్నా! యెంతకష్ట మెంతకష్టము!

శా. ఓసీకైక! వరంబులంచు బతినె ♦ ట్లో బుట్టలో బెట్టి, ధా
త్రీసామ్రాజ్యము నాత్మపుత్రునకు గూ ♦ ర్మిన్ జేర్చితౌగాక రా
కాసీ! యీరఘురామచంద్రునకు ను ♦ గ్రారణ్య వాసత్వ, మే
లా! సంధింపగ బుద్ధిపుట్టె ద్రిప లేదా ♦ నుంతయున్ దుర్మతీ.

నిన్నీతీహ్రాసిచే దుత్తునియలు జేసి మావంశమును నిష్కంటకము గావించెదను జూడుము. (ఖడ్గము నెత్తి మీదికి బోవును.)

రాము—(వారించి) తమ్ముడా! శాంతింపవోయి. అమదాని పైగత్తి దూయుటదగునా!

లక్ష్మ—అన్నయ్యా! యెట్లు శాంతింపుమనెదవు.

ఉ. లోకములెల్ల నీ రవికు § లుండగు రాముడె యీశుడంచు న
స్తోక ముదంబునన్ బొగడ § దుచ్ఛపుబుద్ధిని నిన్ను రాజ్యను
శ్రీకెడబాపి కానల గృ § శింపగ బొమ్మన ధర్మమౌనె! యీ
కైకను కేకయాత్మజుల § ఖండనసేయక శాంతిగాంతునే.

అన్నన్నా! అఖండ తేజోమయ ప్రభాకర మరీచికా పుంజమును జూచి సహింపలేని దివాంధముపగిది జగజ్జన జేగీయమాన పవిత్ర చరిత్రుడైన యీరఘుకులపారావారచంద్ర రామచంద్రునిగాంచి యీదుశ్చారిణి యీకులపాంసని యీకైక సహింపలేక అరణ్యావాసమును విధించెనుగా! ఔరా! కాలమహిమ.

రాము—తమ్ముడా శాంతింపుము. మాతృదేవతనునిందింపరాదు. ఆమె దుశ్చరిత్రయైనట్లున్నను నీవిపు డనార్యమగు కోపమును వహించి దుశ్చరిత్రుడవు కాజూచు చున్నావు.

ఉ. కోపము రాజ్యవృక్షమున § కున్ బరికింపగ వేరుబుస్వ సం
తాపము గొల్పునగ్ని శిఖ § ధార్మిక చింతల నాస్తిచేయుగా
జీవుగుకట్టు సౌఖ్యముల § చేటు నఘంబుల కిల్లునైన యీ
పాపపు గోపమూనుటలు § భావ్యముకాదుర శాంతిగాంచుమా.

వత్సా లక్ష్మణ! నాయందు భక్తి కలిగినవాడవేని శాంతించి యీమను నిందింప కుందువని తలంచెదను.

లక్ష్మ—అన్నయ్యా! నీవు నన్ను వారించుచున్నావు కాని యీకైకకీఘోర (పండ్లు గొరుకుచు) కృత్యములతగునా! అన్నా! ఎంతలెంతలు పుట్టుచున్నవి.

రాము—వెర్రితమ్ముడా! మనమున శాంతివహించి నామాటవినుమా! దైవ నిర్ణయమునం జేసి నావనవాసవిధికి కైకమ్మ నిమిత్తమాత్రురాలైనది కాని వేరుకాదు. నాఫలమున నిట్లువ్రాసి యుండ కైకపలుకకున్నను మరొక వ్యాజముననైన నాకీశ్రమ

తప్పదు. ఇంతకు నేహేతువుచే నాకిట్లు విధించెనో కనుగొన జాలము. నేను పోయివచ్చెద. నీవు సమ్మతించి నన్ననుపుము.

లక్ష్మ—అన్నయ్యా! ఎంతమాట పలికితివి!

చ. అనఘచరిత్ర! నీవు పద ♦ మావలబెట్టిన తక్షణంబె ప
త్తనము స్మశానవాటిక వి ♦ ధంబున నొప్పదె! పౌరులెల్లరుక్
వనటను గుందరే! అటుల ♦ బాడ్వడినట్టి పురిక్ వసింప నొ
ల్లను దమువెంట వచ్చెదను ♦ లక్ష్మణునిన్నై దయయున్న నొప్పవే.

రాము—తమ్ముడా! నాకోరకు కౌసల్యాదేవి పరితాపమునకు దోడుగా నీవలన సుమిత్రాంబకు నూర్మిళకు గూడ సంతాపము గలిగింపరాదు. నీభక్తికి మెచ్చితిని. నామాటవిని నీవాగిపొమ్ము.

లక్ష్మ—అన్నయ్యా! త్రిలోకపూజ్యుడవైన నీకె సంతాపదశకలుగ నీ సుమిత్రాదులకును నాకును కలిగిన సందర్భమూ! కావున నీ వాజ్ఞ నీయకున్నను నీ వెంట నేను రాకమానను.

రాము—వత్సా! అటులైన రమ్ము.

కైక—(తనలో) యీకోపదారి వాడు రాముని వెంట బడి పోవుటకు సమ్మతించుటచే నాభయము తీరినది. (ప్రకాశము) రామ మూర్తిఁ అడవులకు బోవువారికీ నారచీరల సిద్ధపఱచితిని ధరించి పోవువారెవ్వరో వేగ బోవలయు.

రాము—అమ్మా! యిదే పోవుచున్నాము. లక్ష్మణా! మన వియోగముచే మఱింత తపింపకుండ దండ్రిగారిని బ్రబోధింపకయే నమస్కరించి పోవుదము.

లక్ష్మ—యిట్టివానిని బ్రబోధించుటయుగూడ ననవసరమే!

రాము—తల్లీ! పోయివచ్చెదను. (తల్లికి నమస్కరించును.)

సీత—అత్తా! పోయివచ్చెదను.

కౌసల్య—హావత్సలార! ఎట్లు సహింతునురా?

రాము—గీ. ఎన్నటికి మిమ్ము జూతుమో ♦ కన్నతండ్రి
చాల దయయుంచుమయ్యా రా ♦ జన్యతిలక
లక్ష్మ— కానలకు బోవుచున్నాము ♦ కైకవలన
సీత— మీ ఋణము తీరెను కదయ్యా ♦ మేదినీశ.
కౌసల్య—హా రామచంద్ర! (మూర్ఛిల్లును తెరపడును.)



2 వ రంగము—అయోధ్యాపురవీధి.

(భరతశత్రుఘ్నులు ప్రవేశించెదరు)

భరతు—తమ్ముడా! శత్రుఘ్న! మనము బయలు వెడలినది మొదలుకొని అన్నియు దుశ్శకునములే తోచుచున్నవి. యేమి యాపద మూడెనో కదా!

ఉ. వామ భుజంబు కంపిలెడు ♦ వాయస మొక్కటి కట్టితీర్చె న
య్యో నుదిటి కొందలాపడెను ♦ నొయ్యన గొట్టుకొనంగ సాగె నా
వామ విలోచనంబు తడ ♦ బాటొదవెన్ జరణంబులందు నిం
కేమి విపత్తు వించు మొకో ♦ యింతయు దోచకయుండె తమ్ముడా.

శత్రు—అన్నయ్యా నా హృదయము గూడ శంకాకులితమగుచునే యున్నది. యిందువలన మనకేదియో యప్రియమే వినబడునని తలంచెదను.

భర—వత్సా శత్రుఘ్న చూడు మావంక.

సీ. పురగోపురద్వార ♦ ముల తోరణంబులు
బంధించి విడచిన ♦ పగిది దోచె
అల్లదే సౌధగే ♦ హాళుల జిత్రపురంగు
లద్దుచు నాపిన ♦ యట్టు తోచె
అదె వణిక్సంఘంబు ♦ లాత్మవస్తువులమ్ము
కొనమాని చింత ♦ తో గూరుచుండె

పలు గెలంకుల దుకా ♦ ణపు గొట్టులను మూసి
వేసినారేల యు ♦ ల్లాసముడిగి
గీ. మసలగాంచియు బ్రజలు చూ ♦ డని విధాన
మోము లావలకును ద్రిప్పె ♦ నేమికతమొ
పురమునందేమి యాపద ♦ మూడెనొక్కొ-
తమ్ముడా! చూడగా వి ♦ చారమ్ము పొదలె.

శత్రు—అన్నయ్యా! ఏదో విపత్తుమూడెననుమాట నిశ్చయము. అదే కదా! కైకమాంబగారి భవనము. ఆమెవలనగ్గాని మనకు దెలియదురమ్ము

(నిష్క్రమించెదరు.)



3 వ రంగము—కైకభవనము.

భరత—తమ్ముడా! అయోధ్యాపురమెల్ల యెట్లు శోభాదరిద్రాణంబై యున్నదో, మనతల్లిగారి మందిరముకూడ నటులే, శోభావిహీనమై యున్నదిసుమి! తప్పక యేదో గొప్ప యాపదయే తటస్థించి యుండనోపు

శత్రు—ఇంకను సందియమేల?

కైక—(ప్రవేశించి) హా కుమారులార! (కౌగలించుకొని దుఃఖించును.)

భరత—తల్లీ! ఇంతవిచారమునకు గారణమేమి? పూజ్యులైన నా తండ్రిగారికి గుశలమా?

కైక—అయ్యో నాయనా! యిక నెక్కడి తండ్రిగారోయి, ఆమహాత్ముడు స్వర్గస్థుడైనాడు కదా.

భర—హా తండ్రీ!

శత్రు—హా జనకా! (మూర్ఛనందుదురు)

కైక—కుమారులార ! కాలగతి అట్లున్నది విచారింపకుఁడు.
భర—(లేచి) హా సుతవత్సల ! హా జనకా !
చ. సరవిని దేవదానవులు ♦ సంగరమందున దైత్యకోటులన్
నురుమఁగ జేసి దివ్యుల క ♦ నూనజయంబును కూర్చి సద్యశ
స్ఫురణము సర్వదిక్తటుల ♦ శోభిన జేసిన యట్టితండ్రి ! దు
ర్భరతర దుఃఖవారిధి కు ♦ భాలున మమ్ముల ద్రోసిపోయితే
శత్రు—హా కుమార మయజీవిత ! తండ్రీ !
చ. ప్రవిమల సచ్చరిత్ర ! మము ♦ బాసి దివంబు నలంకరించితే
రవిసమతేజ ! యో యమర ♦ రాజి జయాస్పద ! నీవు లేమిచే
భువనము లాక్రమించెగద ♦ భూరితమంబు ప్రభాకరుండు లే
నివిధముగా జగంబలరె ♦ నిన్నువ్యజించి సహించుటెట్లొకో.
హా సుతవత్సల ! నీ కుమార చతుష్టయమున కేమిగతి చెప్పితివి ?
భర—అమ్మా ! అమ్మహాత్ముని యస్తమానదశకు గారణమేమి ?
కైక—ఏమని చెప్పుదునోయి, రాముని వియోగకారణమే.
భర—ఏమీ ! రాముని వియోగమా ! ఆతడెందు బోయెను ?
కైక—రాము డరణ్యావాసమునకు గదా పోయియున్నాడు.
శత్రు—హా ! రామునకేమి అరణ్యావాస ఖర్మమేమి ?
కైక—మీ తండ్రిగారు తొల్లినాకు రెండువరము లొసంగినారు.
అందు నీకు యౌవరాజ్య పట్టాభిషేకమును సేయుటను
రామునకు బదునాల్గేడు లరణ్యావాసమును నిర్ణయించినారు.
భరత—నిన్నాయన వరము లడుగుమన నీవీవిధంబుగ గోరి రాము
నడవులపాలు చేసితివిగా ! ఓసీ ! కులపాంసనురాల ! కైక !
యెంతఘాత తలచితివే.
ఉ. కేకయరాజవంశమను ♦ క్షీరపయోధి హాలాహలంబనా
వ్యాకులహేతువై జనన ♦ మంది దినేశకులంబునెల్ల చీ

శోకపడంగ జేసితివి ♦ కా! కులపాంసని! రామచంద్రుని
శ్లోకుని గానలన్ గలిపి ♦ శుద్ధచరిత్రుని భర్తజంపితే!

శత్రు—ఓసీ ఘాతకురాల! ఆసర్వలోకవంద్యుని రాముని కానలపాలు సేయుమని కోరుటకు నోరెట్టులాడెనే!

కై—శత్రుఘ్న! పితృవాక్యపరిపాలనము సేతునని నేనుకోరునంతలో అతఁడు పడిపోయినాడు. అందులకు నే నేమిసేయుదును. వాని వియోగము సహింపలేక హా రామ! హా రామ! యని బెంగ డిల్లి నీ జనకుండు స్వర్గస్థుఁడైనాడు. ఇంతకును ఏకార్యమైన మగవారిచేతులలో నుండును కాని ఆడుదానిచేత నుండునా! అది తలచిన కార్యమగునా! మీ తండ్రిగారి కళేబరమును తప్తతైలకటాహమున ముంచి దాచి యుంచినాము. మిగుల వగవక అగ్నిసంస్కారము చేసి పిదప రాజ్య మేలుకొనుడు.

భర—హా జనకా!

ఉ. రాముని బుణ్యశీలునిన ♦ రణ్యము పాలొనరింప గాదటం
చీమెకు బుద్ధి చెప్పదగదే ♦ వినకున్నను జంపరాదె! క
ట్టా! మహనీయ కార్తినిడ ♦ టాటున గానలకంపి పుత్రి! హా
రామ! యటంచు నేడ్చుచును ♦ బ్రాణముల న్విడనాడ జెల్లునే

కైక—భరతా! నీవన్నట్లు తన కిష్టములేకున్న నాకు బుద్ధి చెప్ప రాదా! వినకున్న జంపివేయరాదా! యింతకును కారణార్థ మట్లున్నది. వారలట్లైకై విచారింపక భవిష్యత్కార్యమును జూడుము. జన్మించుట మరణమునకేగదా!

శా. నీ వేదాంతము మండిపోయెనుగదే! ♦ నీకింత సిగ్గైన లే
దా! విశ్వేశుఁడె రాముఁడంచును బుధుల్ ♦ స్తోత్రంబుల జ్ఞేయగా
నావిజ్ఞానిని బారదోలి పతికిన్ ♦ బ్రాణంబులం దీసి వై
గా విశ్వంభర నేలుకొమ్మనెదులో ♦ కంబుల్ ననుఁ గిట్టవే.

కైక—భరతా! లోకములు నిన్ను దిట్టుట కంత క్రొవ్వేనా! లోకు లకేమి పలుకాకులవంటివారు. అన్నదమ్ములలో నొకడు రాజ్య మేలిన దక్కినవారికి ననువృత్తియే కదా! ఆ నాడిచ్చిన వర ములచే నీకు రాజ్యము సంప్రాప్తమైనది. నీపుణ్యము మం చిది. నావలన నీకీపదవి వచ్చినదని సంతోషింపక వైగా ఆగ్రహము జెందుచుంటివా!

భరత—ఏమీ! మాతండ్రి నీకు వరములనే యిచ్చెనుగాని యీవిధ ములైన వరములను నీవు కోరకయే నాతండ్రి యీవిధుల నేర్పరచెనా?

కైక—నేనే కోరితినిలే. అయినను నీ మేలుకొరకే నే నిట్లు కోరితిని గాని నేను నెత్తిని బెట్టుకొని యూరేగుటకు గాదు రాముని బాయులేక లక్ష్మణుకును సీతయుగూడ నడవులకే పోయి యున్నారు.

భరతు—ఛీ, ఛీ, కులపాంసనురాల! మా అందరికిని మారకగ్రహ మవు కాని తల్లివి కావేనీవు.

చ. జనకునిజంపి భ్రాతరఘు * సత్తము భూతలమాత సీత, ల
క్ష్మణుల నకారణంబుగను * కానల పాలొనరించి నింద మా
ళిని ధరియించి సిగ్గువిద * లించి ధరాభర మేలుకంటె జ
చ్చిన గడు మేలుకాదె! కుల * శీలము మంటలపాలు నేసితే.

కైక—అన్నన్నా! ఎంతపిచ్చివాడవుర భరతా.

ఉ. సంగరమందు నీ పితకు * సాయము జేసి వరాలగాంచి యి
బ్బంగిని రాజ్యముం గొనగ * వద్దను మూర్ఖుడు వేఱొకండు భూ
మింగలడే సమస్తమగు * మేదిని రాజ్యము చేతజిక్క నీ
వెంగలిబుద్ధిమాని రఘు * వీరుడవై ధర నేలుకొమ్మికన్.

భర—ఓసీ పరమదుర్మార్గురాల

ఉ. ఇంకొకసారి యిట్లు వచి । యించితివేని త్వదీయశీర్షమున్
గొంకక ద్రుంచివైచి జన । కున్ బొలియించి మహానుభావు ని
శ్శంకత బారదోలు కల । షంపుఫలంబును బొందజేసి యో
పంకిలచిత్త ! రాముపద । పద్మములన్ భజియింప బోయెదన్.

ఇక నీవు నోరుమూయుము. పూజ్యురాలైన కౌసల్యాదేవి పదముల బడి యీ దోషము నే నెఱుంగను తల్లీయని వేడుకొని యుత్తరక్రియ లాచరించి ఆ శ్రీరామమూర్తివలె నేనును వల్కముల ధరించి యరణ్యములకు బోయి నా యగ్రజు చరణసేవ సేయుచు గాలము గడిపెదను. శత్రుఘ్నా యికరమ్మ.

(అందరు నిష్క్రమించెదరు.)





# సంపూర్ణరామాయణనాటకము



## షష్ఠాంకము.



### 1 వ రంగము — చిత్రకూటచలము.

(రామలక్ష్మణులు సీత ప్రవేశించెదరు).

రాము — దేవీ ! జానకీ !

చ. ఉరుతర భోగమందుచు న ♦ యోధ్యపురిన్ సుఖియించు నిన్ను భీ
కరదహనాంతరమ్ములను ♦ గష్టములన్ బడలించుచుంటినో
సరసిజనేత్రి ! నామది వి ♦ చారము నేమని తెల్పువాడ బూ
సరమును నగ్నిమాడిచిన ♦ చాడ్పున నిన్నలయించి తక్కటా.

ప్రియురాల ! భీకరారణ్యసంచారము అబలలకు దుస్సాధ్యమని యెంత చెప్పినను వినక, నా వెంటవచ్చి యెట్టి యిక్కట్టుల పాలైతివో, అనుభవమయ్యెనుగదా !

సీత — ఆర్యా ! మీరు నాకై కొందలపడవలదు.

గీ. ప్రాణనాయక మీ పద ♦ పద్మ సేవ
సలుపుచుండిన నితర క ♦ ష్టములు నాకు
సౌఖ్యములుకాగ దోచు నా ♦ స్వాంతమునకు
గాన నాకయి చింతింప ♦ మానగదవే.

అదియుగాక, యీ చిత్రకూటనగము మనకు గృహవాస యోగ్యమైనది.

రాము—ప్రియురాల! అట్లనక మఱేమందువు. నాయందలి భక్తియే నీ చేత నట్లు పలికించినది చూడు. మీా చిత్రకూటచలము.

సీ. కిన్నర మిధునముల్ ♦ కేళీ విహారంబు
సలుపు బూదోట నా ♦ చాయగనుమి
విధుమండలంబు జుం ♦ బింప దత్తత్సుధా
ధవళిత శిఖర సం ♦ తతుల గనుమి
వివిధరత్నద్యుతుల్ వె ♦ లయ జిత్రమ్ములైన
సానువుల్ కల ప్ర ♦ దేశముల గనుమ
అల్లదే విమల జనా ♦ శయ సంపుల్ల
కమలకానన సు ♦ గంధముల గనుమ

గీ. ఈగతి మనోహరం ♦ బయి యొసగినట్టి
చిత్రకూటచలమున వ ♦ సించువారి
కేరికి సుఖంబు నీయదో ♦ సారసాక్షి!
గాన శ్రీమవాసి యిందు సు ♦ ఖంబు గనుమి.

సీత—ప్రాణేశ్వర! ఈసుఖములు సుఖములా! మనము పదునాల్గేడు లరణ్యావాసము చేసి సుఖంబుగ నయోధ్యకు జేరినప్పుడు కదా! మనకు సుఖము.

రాము—తమ్ముడా! ఈ కోలాహలమేదో చూడుమా!

చ. పులుగులు మింటికై యెగసె ♦ భూరిరవంబులతోడ జంతువుల్
గలుగుచు బారజొచ్చెడు న ♦ కారణమిట్టుల లేనిపోని వ్యా
కుల ముదయింపబోదు కను ♦ గొమ్మ భయమ్మన కేమి హేతువో
వలనుగ దమ్ముడా! మనము ♦ వారణసేయుగ నర్హమౌగదా!

లక్ష్మ—(అటునిటు చూచి) అన్నయ్యా! ఆ భరతుని దుండగము జూడుమా! సేనలతో మన మీాదికి యుద్ధమునకు వచ్చుచున్నాడు.

మ. పదునాల్గేండ్లరణ్యముల్ దిరిగి యా * పైవచ్చి తన్నెన్నడో
కదనక్షోణినెదిర్చి రాజ్యమున్ వీ * కన్ జేకొనన్ రాముడం
చదమిన్నైక సుతుండు వచ్చెనదిగో * చూడంగదే యోదయా
స్పద! నీశాంతమె యింత దెచ్చెరణమున్ * సల్పంగ లే లెమ్మికన్

రామ——వెర్రితమ్ముడా! భరతునివంటిసుగుణార్ణవుడేమి? మనమీదికి యుద్ధమునకు వచ్చుటేమి? తనతల్లి చేసిన యపచారమునకై క్షమింపుడని మనల వేడుకొనుటకై వచ్చుచున్నాడు కాని చలపాదియై వచ్చుటలేదు. కావున నీవు త్వరపడి చాపము నెక్కువెట్టకుము.

లక్ష్మ——అక్కటా! అన్నయ్యా! కత్తి నెత్తిమీది కెత్తినను పూలదండయనియే తలంచుచుంటివిగా! సరే అటుపిమ్మట నీవే తెలిసికొనగలవు

(భరతశత్రుఘ్న వశిష్టులు ప్రవేశించెదరు.)

భరతు——(చేతులు జోడించి) హా సర్వలోక శరణ్య! రామచంద్ర!

ఉ. రామగుణాభిరామ! యఘ ♦ రాజివిరామ! దినేశసత్కులా
రామవసంత! ప్రోవవె ప ♦ రాత్పర! నాజనయిత్రి దుష్టయై
నీమహిమంబు సుంతయును గ ♦ ణింపక కానలపాలుజేసెన
య్యా మద కార్యమానక ద ♦ యామతినన్ను సముద్ధరింపవే.

(పాదములమీద బడును.)

రామ——తమ్ముడా భరత! నీకీ వెఱ్ఱియేల? కైకమాంబ నాకేమియు నెగ్గుసేయలేదు గుర్వాజ్ఞను బాలించుటకై నేనుయీవనవాసమునకై వచ్చితిని. అమ్మపైనాకెంతయుగ్రౌర్యము లేదు. నీవుసంకోచింపకుము కాని,

ఉ. బిడ్డలబోలు పౌరులను * వీడి మహాత్ముని తండ్రి సేవలన్
జడ్డనద్రోసి సంయములు * జక్కగ బ్రోవక రాజకార్యమే

యొద్దునదోసిరియోపనుల ౹ నుండెదు నన్నన వచ్చినావె హా
చెడ్డలు మూడవే నృపతి ౹ నీకును వీడిన వెఱ్ఱి తమ్ముడా

భరతు—అన్నయ్యా! లోకపూజ్యుడవైన నీవే యఖిలమును బాయ నీవియోగ సంతాపభరము నోర్వజాలక మనలగన్నతండ్రి దేహమును బాసి స్వర్గముజేర నేనిందు వచ్చుట హానియా!

రాము—ఆ ఆ మనతండ్రి దేహమును బాసినాడ! హాజనకా [మూర్ఛిల్లును]

లక్ష్మ—హాసుతీవత్సలా! (మూర్ఛిల్లును)

సీత—హాస్నుషాభిమానీ! [మూర్ఛిల్లును]

వశి—ఓరామ లక్ష్మణ వైదేహులార! కాలవిపర్యయమునకు ప్రాజ్ఞులైయును మీరిట్లు శోకింతురా లెండు లెండు.

భరతు—అన్నా రామచంద్రా! లెమ్ము (లేవనెత్తును)

శత్రుఘ్ను—లక్ష్మణా! మనము నేటికి తండ్రిలేని వారమైనాము. లెమ్ము విచారము మానుము.

రాము—హాసుతవత్సల! తండ్రీ

ఉ. కౌశికుజన్నముం గనుప ౹ గా ననుబంపెదు నప్పు డేదయా
వేశముతోడ నశ్రువుల ౹ వేమరు గన్నులరాల్చినావు పృ
థ్వీశశిరోమణి! వనుల ౹ కేగెద నిప్పుడటన్న బెంగచే
బ్రాశనమాని ప్రాణముల ౹ బాసిన వాడవె! పుత్రవత్సలా.

లక్ష్మ—హా జనకా!

ఉ. రామునిజూడ లక్ష్మణుడు ౹ రాడత డెందులనుండెనంచు స
ప్రేమను బృచ్ఛచేసెదవు ౹ వేమరు నేగనుపింప నేడిరా
రాముడటంచు బల్కెదు ౹ నిరంతరమా గతినొప్పతండ్రి! మ
మ్మిమ్మె మొయిబ్రోచు వారెవర ౹ హీన కృపాలయ పుత్రవత్సలా,

శీత—హాస్నుషాభిమానీ ఆర్యమహాశయ!

ఉ. తల్లినిగాంచినట్లు గుణ ♦ భామను శాంతను జూచినట్లు న
న్నెల్ల విధంబులన్ గరుణ ♦ నేలుచు మామకవంశమందు సం
పల్లవితాంగివంచుదయ ♦ వార నుతింతువు నన్ను నేటితో
సెల్లెనె! మీ ఋణంబు నృప ♦ శేఖర! మాగతియేమిచెప్పితే.

వశిష్టు—రామభద్ర లక్ష్మణ బిడ్డా జానకీ! సద్గతినందిన వారల విష యమై విలపింపరాదు. రామచంద్రా! తవతల్లి కైకచేసిన యనార్యకార్యమునకు క్షమించి అయోధ్యకువచ్చి నిన్ను రాజ్యమును బరిపాలింపమని భరతుడు వేడుకొనుటకై వచ్చి నాడు.

భరత—అన్నయ్యా! పాపాత్మురాలైన నాతల్లి యపచారమును మన్నించుము.

రాము—తమ్ముడా! యిందు కైకమాంబ చేసినయపచారమే లేదు. నీవు నామాటవిని,

చ. ప్రజలను పుత్రసామ్యులుగ ♦ భావన జేయగదన్న మాని
ల్లజులకు సేవజేయుచు వి ♦ లాసగ నీపదునాలుగేండ్లు న
క్కజముగ గానల న్దిరిగి ♦ కర్మిమ్మర నీ దరి జేరువాడ వి
శ్వజనులుమెచ్చ రాజ్యపరి ♦ పాలనమున్ బొనరింపు తమ్ముడా!

భరత—అన్నా! నీవెన్ని చెప్పినను రాజ్యపరిపాలనము సేయజాలను.

మ. జనకుండాగతి ప్రాణము ల్విడువగా ♦ సామ్రాజ్య మేలంగ జా
లిన పూజ్యుండవు నీవె యీగతి వనా ♦ శిన్ భార్యాసోదరమ్మరన్
ఘనశోకాగ్నిని గాలిపోయిన స్నశా ♦ నక్షోణి రాజ్యంబునా
ననయంబున్ భరియింపజాల రఘు రా ♦ మా! వచ్చియేలంగదే.

రాము—తమ్ముడా నేను త్రికరణశుద్ధిగ జెప్పుచున్నాను. వినుము పితృవాక్యమేరికిని దాటగూడనిది కదా మనతండ్రి నీకాధరణీ సామ్రాజ్యమును నాకీ వనరాజ్యమును బాలింపుమని యాన తిచ్చినాడు. ఇంతకును గారణభూతురాలు కైకమాంబ యని

నీవామెపై నాగ్రహింపరాదు. ఆమె నిమిత్త మాత్రురాలు. ఇదియంతయు దైవనిర్ణయము భగవంతుండీ నిర్ణయము సేయుటకు గారణమేదో మనము ననంతరమునగాని తెలిసికొనలేము. భగవన్నిర్ణయము దాట దరముకాదు. నీవు స్వస్థచిత్తుడవై పోయి రాజ్య మేలుకొనుము నాయందు భక్తి కలదేని రెండవ మాట బలుకక నేను చెప్పినట్లుచేయుము.

భర—అన్నయ్యా! అట్లైన మీపాదుక లొసంగితిరేని వాటినొకచో నుంచి మీ పేరున నందిగ్రామమున వసించుచు రాజ్యమేలెదను కాని మీరు రాకుండ నయోధ్యలో బ్రవేశింపజాల.

రాము—తమ్ముడ! అట్లైన నీవే తీసికొనుము. (పాదుకలిచ్చును)

భరతు—గీ. ఎవని పదపద్మ రేణు వ్రే ♦ కింతసోక
రాతినాతిగ జేసె బ్ర ♦ ఖ్యాతిమీర
నట్టి శ్రీరామపాదుక ♦ లాదరమున
మౌళి ధరియించి రాజ్యంబు ♦ నేలువాడ.

(శిరమున ధరించును.)

రాము—తమ్ముడా! నీకు శ్రేయమగుగాక ?

వశి—రామచంద్ర! సుస్నాతులరై పితరులకు దిలోదకాదుల విడచి యనంతరమ దండకారణ్యమునకు బోవగలరు రండు పోవుదము.

(అందరు నిష్క్రమించెదరు.)





శ్రీ

# సంపూర్ణ రామాయణ నాటకము.

## సప్తమాంకము.

### 1. రంగము—దండకారణ్యము.

[ రామలక్ష్మణ సీత ప్రవేశించెదరు ]

రాము—దేవీ జనకరాజనందని! అత్రి మహర్షి చెప్పిన దండకారణ్యమిదియే సుమీ!

ఉ. కూరమృగంబులా పొదల ♦ ఘోరత బొబ్బలు వెట్ట భీతిమై
పారెడు మింటికై సకల ♦ పక్షిగణంబులు, లేళ్లగుంపులున్
దోరముగాగ గుల్మముల ♦ దూరెడు నిందున దైత్యకోటి సం
చారము సేయుటబ్బురమె ♦ సంయము లిందువసింప నేర్తురే

సీత—నాథా యీదండకారణ్యము చూచుటకే భయమగుచుండ నిందువసించు వారెంతటి కర్కశులు కావలయును! కావుననె యిందురాక్షసులు వసింతురు. అబ్బా నాథా! నడువలేకుంటినికదా!

చ. ఒక యడుగైన వేయుటకు నోపిక ♦ లేదుకదా! పథంబు కం
టకమయమయ్యె నెట్లొ!యిచ ♦ టన్గయి సేయుదుమన్న నుక్కికిన్
సుకరముకాదు మై వడక ♦ జొచ్చెడు జమ్మటలూరె ప్రాణనా
యక యిక నేమిదిక్కు నను ♦ నావలజేర్చుట లెట్లో దైవమా.

రాము—ప్రాణేశ్వరీ కాంతార సంచార మెట్లుండు ననుకొన్నావు. దుర్భరమని నేను తొలుతనే చెప్పితినికదా!

సీ. ఆరామ మా ! ♦ భీకరా రామములుకాని
హంస యానములతో ♦ నాటలాడ
కేళీ పికవ్రజ శుకాలాపములె ! భీక
రారావములె కాని ♦ యాలకింప
సౌఖ్యాస్పదపు భర్మ ♦ సౌధంబులే సాధ్వి
శాత పాషాణముల్ ♦ సంచరింప
ఆళీ జనంబుల ♦ కాస్పదమే ! దైత్య
గణముల కిల్లు స ♦ ఖ్యంబు సలుప
గీ. రమణిరో యిట్టి భీకరా ♦ రణ్యమేడ
మించు బోడులకును విహ ♦ రించుటేడ
నిన్ను విడనాడలేక ♦ యీయెన్నరాని
వెతల బడుచుంటివీవు చె ♦ ప్పినను వినక.

సీత—ఓజీవితేశ్వర ! మనకర్మసూత్రము మనలనిట్లునడపించుచుండు దాటదరమా కావున నాకొరకు విచారింపకుము

లక్ష్మ—అన్నయ్యా ! నేనానాడే చెప్పితిని యీయాడుదాని మాటకు మనము బద్ధులమై యిట్టిశ్రమకు వలయొగ్గరాదని కన్నులారా చూచుచుంటివా ! ఇపుడు వైదేహి యెంతశ్రమ పడుచున్నదో.

ఉ పాతకురాలి కైకను కృ ♦ పాణముచే బరిమార్చియున్న నీ
భూతలమాత సీత వన ♦ భూముల సంచరణంబు సేయుమార్గ
బ్రాతిగ శాతకంటక వి ♦ భంగ పదాంబుజ యామునిల్లు నే
త్రాత తబాష్పబిందువుల ♦ నంతముగా గుఱియుంగ సాగునే.

రాము—తమ్ముడా! ఎంత చెప్పిననునీఘూతత్వముమానకుంటివిగదా!

లక్ష్మ—అన్నా ! మనకిన్ని కష్టముల గలుగ జేసి దురాత్మురాలి యెడ ఘూరత్వము జూపుట నుచితమా ?

రాము—

మ. అదిగో గోపురమాను మన్నస్స్మృతిలేదా తమ్ముడా! యెట్టి దు
ర్మదవాక్యంబుల బల్కజొచ్చితివి! శౌర్యంబెల్ల మాతృవ్యథా
స్పదమానస్థుల జేయబాడియొకో తుచ్ఛశ్రీకినాశించియా
సుదతిన్ దల్లిని జంపుటల్ రవికులక్షోభంబుగానుండునే.

లక్ష్మ—అన్నయ్యా; మాతల్లిపై దేహిపను కడగండ్ల జూచి సహింప
జాలక అట్లంటి నాయపచారమును మన్నింపుము.

(తెర లేవ విరాధుడు వికృతాకారముతో బ్రవేశించును)

విరాధుడు—ఆహాహా! నేడెంత మంచిదినము చిరకాలమునకు నాకు
మనుష్యమాంసము లభించినదే! వహావ్వా యీపిల్ల బహు
కోమలముగ నున్నది. తాటితేగలోని లేత చందమామవలె
బహురుచిగా నుండును. మునుపేని జవిమూచెదగాక (సీతను
పట్టుకొనును,)

సీత—హా ప్రాణేశ్వరా! (మూర్ఛిల్లును)

విరా—ఓరోరి మనుష్యాధములార! అఖిలదేవ యక్షకిన్నర విద్యాధర
మనుష్యలోక దుర్నిరీక్ష్యుడైన యీవిరాధుడు సంచరించు
భీకరారణ్యమున మనుజులు సంచరింప వెరతురే. ఔరా మీరు
తాపస వేషములతో నెంత నిర్భయముగా బ్రవేశించితిరిరా!

లక్ష్మ—అన్నయ్యా! త్వరపడి వేగ వీనిపై శరమును సంధించుము.

రాము—(బాణములవిడచి) ఓరీ! విరాధ! యిదే చచ్చితివిరా!

విరాధు—ఓరి కుర్రకుంకా (ఆబాణములందికొని విరచివైచి) మీరు
నన్నాజంపునది!

రాము—ఔరా! ఆశ్చర్యముకదా! (మరల బాణములవిడచును.)

విరా—ఓరీ మీబాణములే నాకింత రుచిగానుండ మీరెంత రుచిగా
నుందురో కదా! యీ యాడుదానితో నాకేల (సీతనువిడచి
రామలక్ష్మణులను బట్టుకొనును.)

లక్ష్మ—అన్నా ! వీడు మనల నెత్తికొని పోకుండ బాహువులను నరకు దము (నరుకుదురు.)

విరాధు—[కూలి] మహాత్మా దశరథ రామచంద్ర! నిన్ను బరాత్పరుడని తెలిసికొంటిని. నీవలన నాకు శాపవిమోచనమైనది. నేను తుంబురుండను గంధర్వుండను రంభాలోలుడనై కిన్నర నాధునాజ్ఞ నెరవేర్పకుంట నాకీశాపమొసంగె నంత నేను ప్రార్థింప దయాళుండై లోకరక్షణార్థ మవతరించిన దశరధపుత్రుడైన రామచంద్రుం డీమార్గమునవచ్చి నీబాహువు లెప్పుడునరుకునో అపుడు నీశాపవిమోచనమని యెఱింగించె. అదిమొదలు మీరాకకై వేచియుండి నేడుకృతార్థుడనైతిని నాకళేబరమును ఖననమున పూడ్చిరేని దివ్యశరీరముదాల్చి ముందు మీరేగవలసిన మార్గంబును జెప్పిపోయెదను స్వామి ! మీకివే వందన శతములు.

రాము—తమ్ముడా ! యీవిరాధుని పూడ్చివేయుము.

లక్ష్మ—చిత్తము (వానినీడ్చికొని పోవును.)

రాము—(ఆకసమువంకజూచి) ఏమీ ! ఏమనుచున్నావు ! సమీపమున నున్న శరభంగ మున్యాశ్రమంబున నేడు వసించి మరునాడు పంచవటీతీరమున బ్రవేశించుమనియా అటులే చేసెదము. వైదేహీ ! లెమ్ములెమ్ము. విరాధుడు సంహరింప బడినాడు భయములేదు. (తెరబడును)

---

2 వ రంగము—పర్ణశాల.

[రామ లక్ష్మణులు సీత ప్రవేశించెదరు.]

రాము—తమ్ముడా ! లక్ష్మణ !

చ. అనుపమ సత్కళా విభవమైన ♦ త్వదీయ ముఖేందు మండలం
బున కదియేల దైన్యదశ ♦ మూడెను తెల్పగదయ్య తమ్ముడా.

వనముల గష్టముల్పడగ ♦ భారమటంచు దలంచినావా ! నీ
జననిని బత్నినిన్ గనగ ♦ స్వాంతమునందున బ్రీతిపుట్టెనో.

లక్ష్మ—అన్నయ్యా ! మీరట్లెన్నటికిని దలంపకుడు.

ఉ. తల్లియు దండ్రియున్ హితులు ♦ దైవము గుర్వును నీవకావె నా
కెల్ల విధంబులన్ వగవ ♦ నేల ప్రమాదముచేత దాపసిన్
ద్రెళ్లగ నేసి యీకరణి ♦ దీనత మీదరి జేరినాడ నా
యుల్లము తల్లడంపడగ ♦ యుండగ శాంతిని జేయవేడెదన్.

రాము—ఏమీ ! తాపసినే త్రుంచితివా ! మనవంశసంభవుల యంత
రాత్మ లట్టి యనార్యకార్యముల కెన్నడును సిద్ధపడవే ! అది
యెట్లుజరిగెను ?

లక్ష్మ—పర్ణశాలకై కట్టెల నరుకుచుండ నొకవిప్రవటువు వచ్చి యీ
పొదలో వ్రేలుచుండు చంద్రాయుధమును గైకొని ఆపొదను
నరుకుమన నరికితిని. అందొక తాపసియుండుటచే నతడును
నా వ్రేటునకు ఖండింపబడినాడు. చెప్పిన విప్రుడు పారిపోయి
నాడు.

రాము—వత్సా ! భయపడకుము. మునిజను లనార్య కార్యములకెన్న
డును బురికొల్పరు. వాడెవ్వడో రాక్షసుడే కావచ్చును.

శూర్పణఖ—(అందకత్తెయై ప్రవేశించి) తాపసవేషమున దపమాచ
రించు నాకొడుకును జంబుకుమారుని యీలక్ష్మణుడు వధించి
నాడని కోపముతో నీనిని మ్రింగివేయవచ్చితినిగాని వీనియన్న
రాముని జూచుటతోడనే కన్నకొడుకును జంపినారన్న అహం
కారము పోయి కామాంధకారము హెచ్చె వికృతాకారము
తోవచ్చిన రాముడు నన్నువరింపడని మిక్కిలి అంగముగల
అచ్చరవంటిదాననై వచ్చితిని. సమీపించి మాట్లాడెదనుగాక!

(ప్రకాశము) ఓహో! రామమూర్తీ! నీకు స్వాగతము లర్పించుచున్నాను. రక్షింపుడు.

రామ—ఓకాంతా! నీకు శుభంబగుగాక నీ వెవ్వరిదానవు?

శూర్ప—రాజపుత్ర! ధర్మముల నెఱింగియు రక్షింపుమని శరణు జొచ్చినదానికి ముందుగ నభయంబీయక వృత్తాంతమడుగుట పాడియా! రక్షింపుమన్న నాదీనవాక్యము నప్పుడే తువ్వలచే మేపితివా!

రామ—అబలా శిరోమణి! రక్షించుటకే కదా! నీ వెవ్వతెవనియు నాపద యేదియనియు నడిగితిని కావున వేగ జెప్పుము.

శూర్ప—తెలిపెదను కాని యీామె నీకేమి కావలయును?

లక్ష్మ—ఓహో! భామినీ ఆయంశము నీకేల? నీవు వచ్చినపని చెప్పి కొనుము.

శూర్ప—(అసూయతోజూచి) ఓయీ నీమొగమును బ్రహ్మహత్యా దోషము తాండవమాడుచున్నది. నీవు పాపాత్మునివలె గను పట్టుచున్నావు. నీతో మాట్లాడరాదు. అవలనుండుము.

లక్ష్మ—(భయముతో) అక్కట! నిజముకాదుకద!

రామ—కాంతా! వానిదోషముల నీవు గణింపబోక నీకార్యమేదో తెలుపుము.

శూర్ప—రామచంద్ర! నాకార్యమేదో నేను తెలుపవలయునా నీకు దెలియదా! రసికుడవు కావా!

రామ—(తనలో) ఔరా! ఏమీ దీనివాక్యములు భావపూరితములుగ నున్నవే కాముకురాలు కాదు కద! అయిన నడిగెదను. (ప్రకాశము) కాంతా! నీయభిప్రాయము నాకు దెలియదు నీవే చెప్పుము.

శూర్ప—గీ. భూప! నాసాటి యసమాన ✿ మోహనాంగి
భువన మోహనుడగు నీదు ✿ పొంత జేర
నేమికారణమో ✿ వచియింప వలెనే
అవియె యని నీవు దెలియదా ✿ మదనమూర్తి.

లక్ష్మ—సరిసరి యింక జెప్పనవసరము లేదు. అన్నయ్యా! యిదివరకు జేసిన బ్రహ్మహత్యతో బాటు బ్రాహ్మణీహత్య కూడ జేసెదను తలపిమ్మా.

శూర్ప—నీవందులకు దగినవాడవని నేను మున్నే యెరుంగుదును.

లక్ష్మ—ఏమెరుంగుదువు?

శూర్ప—నాకునూహని జంపినవాడవని.

రాము—నీవెవ్వతెవు.

శూర్ప—నేను రావణుని సోదరిని శూర్పణఖ యనుదానను.

లక్ష్మ—ఓహో ఆలాగునా అటులైన నీకు మేము శత్రువులము కదా మాఅన్నగారి నెందులకై శరణంటివి

శూర్ప—రక్షింతునని యభయం బిచ్చినగదా చెప్పునది ఏమిరాము! నాకభయప్రదానము మాట యేమిచెప్పితివి?

రాము—నీయాపద యేదో తెలుపుము

శూర్ప - ఓహో ఎంత గడుసువాడవయ్యా ఆమాట ఆడుదాననైన నానోట బలికింప దలచితివా పోనిమ్మా సిగ్గువిడచి నేనే చెప్పెదను.

చ. వనజదళాక్ష నాయవయవంబులు ♦ పొంగె శరీరమంతటన్
గొనకొని పుల్కలుంబొడమె ♦ కోర్కులు నీయెడ బ్రాకజొచ్చెబి
గ్గన ననుకౌగలించుము వి ♦ కారమడంచుము కామరూపినై
యనయము మేలుగూర్చెద కృ ♦ పాకర సందియమందకుండగన్.

లక్ష్మ—ఛీ ఛీ వ పిష్టురాల స్త్రీవగుటచే బ్రతికిపోతివి.

శూర్ప—ఓయీ! యీరామునియందు నాకు మోహమొదవుటచే నాజంబుకుమారుని నీవు చంపినను నీవు నానుండి బ్రతికిపోతివి యెట్లైన రాముని నావశము జేసికొని నీభరతము పట్టించెదను.

లక్ష్మ—ఏమే పాపిని! యిదేనిన్ను జంపెదను. [కత్తిదూయును]

రాము—తమ్ముడా! విరహార్తను చంపరాదోయి.

శూర్ప—రామచంద్రా! యిప్పటికి నామీద గరుణవచ్చినదా! యిక నీభార్య నవలకు దోలివేయుము. నాకున్న యందమున నీమెకు నూరవవంతైన లేదు సుమీ.

సీత—ఓసీ సిగ్గుమాలినదాన! అప్పుడే యెంత లేసి మాట్లాడుచుంటివే.

శూర్ప—రామమూర్తి నీవంటి మగనిని గట్టుకొని గౌరవము లేక నీభార్య యెట్లునోరు చేసికొనుచున్నదో చూచితివా!

రాము—శూర్పణఖా నేను భార్యతో వచ్చినాడ నీవు నాకవసరము లేదు. నీవుపోయి లక్ష్మణుని వేడుకొనుము.

శూర్ప—ఇదే! నీవంటి మగవాడెచ్చటనైన నుండెనా రామయ్యా! వలచి వైబడ నావలన కావున్నవాని నిన్నే జూచితినిగాని మరెవ్వరును లేరు. అట్లయిన లక్ష్మణునే యడిగెదను లక్ష్మణమూర్తి నన్ను మీయన్నగారేలు కొమ్మన్నారు ఏమంటివి?

లక్ష్మ—నావలన కాదు. ఆయనపాదములనే బడుము.

శూర్ప—అతడైన సవతిపోరున్నదయ్యా నీకు మంచిలబ్ధిని గలుగ జేసెదను సుమీ.

లక్ష్మ—ఇక నొక్కసారి ప్రేలితివేని యీకత్తిచే నీఖండలు గోసెదను

శూర్ప—ఈతనిచెంత నూరేళ్ళారపు బాలెక్కువ [రాముని సమీపించి] రామమూర్తి నిన్నే యేలుకొనుమని చెప్పినాడు.

రాము—నావలనకా దావలకు బొమ్ము.

శూర్ప—ఆ! ఏమనుచున్నావు! నాఅంత దానినే నిరాకరించితివిగా మంచిది. యీపిల్ల నీచెంతనుండబట్టి నామాట త్రోచివైచుచున్నావు. కాన దీనిని మ్రింగివైచెదను. అలలలా [నోరుదెరచి సీతమీదికి బోవును.]

రాము—[శూర్పణఖ శిఖబట్టుకొని] తమ్ముడా! దీనికి నాసికాలంకారమును జేసి పంపుము. [సమర్పించును.]

లక్ష్మ—[శూర్పణఖ ముక్కు గోసిపంపును.]

శూర్ప—[వికృతాకారముతో వచ్చి] హా చచ్చితినిగా దురాత్మా! హా సోదరులార! హా ఖరదూషణాది రాక్షసులార యీరాజాధముండు నాముక్కు జెవులు గోసి పరాభవించినాడురా! వేగవచ్చి వీరిని జంపుడు. రక్తము ద్రావుడు. అయ్యో నాముక్కు రక్తము నేనే ద్రావుచుంటిని రావేగరండు. వీరల బరిమార్చెదు కామదాంధులార! మిమ్మిప్పుడేమి చేసెదనో చూడుడు.

[నిష్క్రమించును]

రాము—దేవీ! నీవు పర్ణశాలలోనికిం బొమ్ము రాక్షసులిప్పుడు సమరమునకై రానై యున్నవారు.

సీత—చిత్తము నాథా! బహుభద్రము సుడీ [నిష్క్రమించును]

[ఖరుడు దూషణుడు ప్రవేశించెదరు]

ఖరు—అలలలల్లా! అరేమాన వాధములార

శా. అక్షీణప్రతిభా విశేషమున ది • వ్య శ్రేణి నిర్జించిషా
లాక్షాగ్ని చ్ఛటలైన నార్పగల ద • ర్పాధిక్యతర్క మించుచూ
రక్షశ్శ్రేణి సహోదరీమణికి • గర్ణచ్ఛేదమ్ము మానవా
ధ్యక్షుండెవ్వడో చేసె వాని నిదె వి • ధ్వంసంబు గావించెదన్.

దూష—ఓరోరి నరకకటకములారా ! రండు మాహేతిఘాతలను బలి కండు. ఓహో మాకశంబుగ నుపకరింను మానవులకు నేము అరచేత బండ్లు మొలచిన వేరండు.

రాము—ఓరోరి రాక్షసాధములార ! యిదే నాబాణాగ్ని కాహుతి యగుచున్నారు. (బాణగుల విడువ బత్తురు. తెరపడును)

3 రంగము:—రావణుని సభాభవనము.

(రావణ ప్రహస్తులు ప్రవేశించెదరు.)

రావణ—ప్రహస్తా ! మనమగాల మేమోవ్యతిరిక్తముగ నున్నట్లుతోచు చున్నదోయి యేమందువా! మానవమాత్రుండైన యొక్కనరా ధముండు.

గీ. తాటకనుగూల్చి కౌశికాధ్వరలాభిభంగు
కాను బాహుమారీచుల నడచెనెప్పు
డదిమొదలు నాదుమదిని శల్యంబుకరణి
నెలుగుచున్నాడు పార్థరబ్దమేమొ మంత్రీ.

ప్రహ—స్వామి ! రాక్షసచక్రవర్తి వైనసీవే యిట్టియదైర్యోక్తులనా డిన మాబోంట్ల గతియేమి.

శూర్పణఖ.—(ప్రవేశించి) హా అన్నయ్యా ! నీవంటివానికి జెల్లె లనైయొక్కనరాధమునిచే ముక్కు జెవులు గోయబడి పరాభ వింపబడనీవూరక చూచుచుందువా! అయ్యో ! అమ్మయ్రోవచ్చి తినర్రో.

రావ—(ఆశ్చర్యముతో) ఏమీ ! చెల్లెలా నీముక్కు గోసినదురాత్ముం డెవ్వడే?

శూర్ప—హా సహోదరా ! రామలక్ష్మణులట దశరథుని పుత్రులట పంచవటీతీరమున బర్ణశాల నిర్మించుకొని యున్నారు. నావిక్ర తాకారమును జూచి ఓసీ యిటురమ్మని నాముక్కు చెవులురా

10

గోసినారురా తండ్రి అయ్యో నా రక్తము నేనే త్రాగుచున్నాను అన్నా.

రావ — చెల్లెలా ! మనఖరుడు వారిని సంహరింప కూడుకొననా.

శూర్ప — అయ్యో ! నాయేడ్పు వినివచ్చి వానిపై కేగి వాడును చచ్చినాడురా !

రావ — దూషణుడందు చచ్చెనే ! త్రిశిరస్కుడు మొదలగు పదునాల్గు కోట్లరక్కసు లెందరిగినారు?

శూర్ప — అయ్యో ! వారందరు ఖరుని ననుసరించి యమపురి కేపోయినారురా. జనస్థానమంతయు రాక్షసశూన్యమై పోయినదిరా

రావ — హా సహోదరులార ! ఖరదూషణాది రాక్షసవీరులార !

గీ బాహుబలవిధాన బ్రహ్మాండ భాండములను
బట్టి యాడెడునట్టి దోర్బలము కలిగి
నట్టిమీ కెల్ల నిపుడొక్క యల్పమనుజు
డక్కటా మృత్యువయ్యెనే యనుజులార.

ప్రహస్త మనకింతకంటె గ్రోధకారణము లేదు కావున సమరసన్నాహమును గావింతము.

శూర్ప — అన్నయ్యా! నేనొక్కయుపాయమును జెప్పెద వినుము. ఆ ముని యెదట రణము సేయ రుద్రాదులకైన వశముకాదు. వానికి సీతయను భార్యకలదు. ఆమె త్రిభువనసుందరి. ఆమెనెటులో నీవు సంగ్రహించితివేని యావిచారముచేత నతడు స్వయముగ బ్రాణముల బాయగలడు. పాయకున్నను నిస్తేజుడై నీచేత జచ్చును ఆమె నీకుదక్కును.

రావ — బలే! సహోదరీ చక్కని యుపాయమును జెప్పితివి వెలె ! అటులే చేసెద. నీవుపోయి నాసికా కర్ణములకు మందు వేసికొనుము

శూర్ప— అటులే పోయెదను. కాని సాధ్యమైనచో రాముని రెక్కలు విరచికట్టి నాకర్పించితివేని నాకసి తీర్చికొనెదను.

రావ — అటులే చేసెదనులే పొమ్ము.

శూర్ప— మంచిది (వడచుదు దనలో) నాకా రాముడే చిక్కిన నట్లో నాకోరిక తీర్చుకొందును. (నిష్క్రమించును.)

రావ— మంత్రి ప్రహస్తా నామాయాకల్పనల యందసమాన ప్రజ్ఞకలిగిన మారీచుని సహాయమునగాని సీతనపహరించుటకు వీలులేదు. కావున మారీచునితల్గచెదను (ధ్యాన మభినయించును.)

ప్రహ— చిత్తము.

మారీచుడు—(జటావల్కలములతో బ్రవేశించును.)

రావ— మాతుల మారీచ యిటుకూర్చుండుము

ఉ. వింటివె! దూషణాద్యసు * రవీరులు రాముని చేత గ్రుగ్గుటల్
కంటివె! నాసహోదరికి * గర్ణమునాసియుగోశినారు నీ
వంటి సహాయకారుడు ధృ * వంబుగ నాకిక లేరు చూడవా
ల్లంటివి వానిభార్యను చ * లంబున దస్కరణాంబుసేయుగా.

కావున నిందుల కేదయో యుపాయము చెప్పి నాపగదీర్చుము.

మారీ— అక్కటా! భాగినేయ! నీవు చేచేతల మృత్యువు నోటదలబెట్ట జూచుచున్నావు సుమీ. యేమందువా!

ఉ. ఈయఖిలప్రపంచమున * కీశ్వరుడై తనరాయనట్టి నా
రాయణ మూర్తియే రిపువి * రాముడు రాముడనంగ మానవుం
డేయనరాదు వానినని నెంత * యు డీకొనశక్యమా న! దై
తేయులదృంప ధాత్రిజని * యించెనటంచు నుతింతురెల్లరున్.

అంతియే కాక కౌశికుని యజ్ఞభంగమును జేసెడు పట్టున నొక్కకోలచే నన్ను సముద్రమధ్యమున బడవైచి సుబాహ్వాదుల నందరనొక్క బాణమున సంహరించెను ఆమహాత్ముని పరాక్రమాగ్నికి మిడుతనై యది

మొదలు రామయనుశబ్దము నుచ్చరింపక భయముతో ప్రాణములబిడి కిలించుకొని తపోవృత్తిని గాలక్షేపము సేయుచుంటిని. కావున నట్టివా నిపై గట్టలుకబూని వంచనోపాయము నాలోచించుట మృత్యువుకోట దలపెట్టుటయని తలంచుము అదియుగాక నీయంతవారు ఖరదూషణా దులారామశరాగ్నికి భస్మమైపోయినారు. నీవు వివేకవంతుడవైతివేని యారామాగ్ని లంకవరకు బ్రజ్వరిల్లకుండ జేసికొని యుక్తిగాబ్రతు కుము.

రావ — ఏమీ మామా! పెద్దవాడవని నీతో నాలోచించినందులకు
నాకిదియా! చెప్పుచున్నావు నామాటలను వినుము.

శా. మాయాకల్పనలందు మేటివిగదా ♦ మామా కురంగంబవై
యాయబ్జాక్షిమనంబు మోహపడజే ♦ యన్ రాముడద్దానికై
పోయిన సీతను లక్ష్మణాయనుచు బి ♦ ల్వన్ వాడునుంబోవునే
నాయత్న్యాకృతి నామ్మెగానెన నీ ♦ యుక్తిన్ సమర్థింపుమా.

నీవు ప్రాణములు పోవునేమోయని నామాట నిరాకరించితివేని నాచేత నైన నీకుమరణము సిద్ధము. నాకీ యుపకారమును జేసితివేని మనకుల ముపై నభిమానమున్నదని తలంచెదను. ఏమిచెప్పెదవు.

మారీ — (తనలో) ఎటులైననాకు మరణము తప్పదు యీదుష్టునిచేత జచ్చుటకంటె భగవంతుడైన రామునిచే జచ్చిన మోక్షము కలదు. (ప్రకాశము) భాగినేయ నీవుచెప్పినట్లే చేసెద నీవు నీయుద్యమమునందుండుము.

రావ — మంచిది వేగరమ్ము. (అందరు నిష్క్రమించెదరు.)



4 వ రంగము—పర్ణశాల

(రామలక్ష్మణులు సీత ప్రవేశించెదరు.)

రాము—లక్ష్మణా! యిక్కడి క్షేత్రాంతమునను న్న ఖరదూషణాది రాక్షసులెల్లరును సమసిరని తలంచెదను.

లక్ష్మ—రక్కసులు మాయావులుకదా! మనమెట్లు నిర్ణయింపగలము.

సీత—ప్రాణేశ్వరా! అటుచూడుడు.

చ నుగవ నింద్రనీలముల ◆ కాంతులు రంజిల దారలట్టులా
కనకపు మేనజుక్కలు వి ◆ కాస మెలర్పగ గోళ్ళుదాటుచుఀ
దృణతతి మేయుచున్నవల ◆ దేరి కనుంగొను లేడిపిల్ల నా
మనను వారింపజొచ్చెగను ◆ మా! యదె దానిని దెచ్చియీయుడీ.

జీవితేశ్వర! నేనద్దానిని గారాబముగ బెంచికొనుచు గాలక్షేపము జేసెదను

రాము—ప్రియురాల!

మ. రమణీ! యేల భ్రమింతువా కనక నా ◆ రంగంబు చేష్టావిలా
సములన్ జూడ సుకారులం డెవడో యా ◆ సల్గొల్పివచింప ని
క్కముగా నీగతివచ్చెనంచు దలతున్ ◆ గంజాక్షి! యాలేడికై
భ్రములన్బొందకు మాయరాక్షసుల చ ◆ ర్యల్ నమ్మగావచ్చునే.

లక్ష్మ—అమ్మా! అన్నగారిమాట సత్యము నీవా సారంగమును జూచి భ్రమింపకుము.

సీత—నాథా! మీరట్లనిన నేనేమందును.

శా. కాలక్షేపము లేక బెగ్గడిలి యా ◆ కల్యాణ సారంగపుఀ
లీలల్ జూచుచు బొద్దుపుచ్చుటకు నీ ◆ లీలన్ మిమున్గోర నో
బాలా రాక్షసమాయలంచు బలుకం ◆ భావ్యంబె మైదాల్ప హా
రాలా! ఆభరణంబుగా మృగము గో ◆ రన్ బెద్ద రాద్ధాంతమా.

రాము—(తనలో) ఓహో ఆడువారి దెప్పుడుమాటలు శూలపుంబోటుల మించును. (ప్రకాశము) ప్రాణేశ్వరీ ! ఆగ్రహింపకుము. చేతికిజిక్కిన ద్దోడి తెచ్చెదను లేకున్న గోలగూల్చియైన నాలేడిని నీకు దెచ్చియిచ్చెద లక్ష్మణా ! యిక పోవకతీరదు నీవు బహు భద్రముగ జానకిని గాచికొని యుండుము.

లక్ష్మ—అన్నయ్యా అటులే పోయిరండు.

రాము—(నిష్క్రమించును.)

లక్ష్మ—తల్లీ ! ఆలేడి తప్పక రాక్షసమాయానిర్మితమే సుమి ?

ఉ. నమ్మకయుంటివమ్మ రఘునా ♦ థుని వాక్యము సుంతయైన న
ధ్యమ్ముగ బాంధవుల్ మరణ ♦ మందగ గ్రోధపరీతి చిత్తుడై
యిమ్మెయి మోసపుచ్చ దను ♦ జేశ్వరుడెవ్వడో ! వచ్చెజుమ్మి శీ
ఘ్రమ్ముగ విందువమ్మ రఘు ♦ రాముని చేత దదీయవృత్తమున్.

సీత—లక్ష్మణా ! నీ వారామచంద్రుని యనుజుడవు కావా ! ఆయన పరాక్రమము నే వర్ణించుటకు నేనా బంగారులేడి నెత్తికొని యాడునపుడైన మావదినగారిమాటయే నిజమని తలంపకుందువా ? (తెరలో) హా లక్ష్మణా ! హాతోస్మి, హాతోస్మి.

ఇద్దరు—(ఆశ్చర్యమభినయించెదరు)

సీత—అయ్యో ! లక్ష్మణా ! ఆవాక్యంబులు మీయన్నగారివి కావా! ఆమహాత్మునకేదో ఆపదమూడినట్లు తోచుచున్నది నాయనా వేవేగబోయి మీయన్నగారినిరక్షించితోడ్కొని రాగదవోయి.

లక్ష్మ—తల్లీ ! భయపడకుము.

మ. ధరణీచక్రము తారుమారయిన నై ♦ త్యశ్రేణులున్ దివ్యులున్
భరమాసల్లొకసారి పైబడిన శుం ♦ భద్బాహుదర్పంబునన్
శరవారంబున గూల్చుగాని యొక వే ♦ శంబైన భీతిల్లునే
స్థిరచిత్తంబున నుండుమమ్మ మృగమ ♦ ర్థిదెచ్చి నీకిచ్చెడున్.

సీత —

మ. అయయో లక్ష్మణ! యేమి యిట్లనెదవా • హాలక్ష్మణా! హాహా తో
స్నియటంచుఁ గడు దీనస్థై యరవఁగా • సింత్రైన నీయన్నపై
దయలేకుండఁగ భీతిలేదనుచు భ్రా • తఁ బోవ బోనైతి నీ
నయబుద్ధిన్ గపటాగ్ని గాల్చితివె! • యన్యాయంబుగా నీయెడన్

అక్కటా! నీవిట్టివాడవని గలనైన నెఱుఁగకపోతిని కదా! నీయన్న గారియందలి భక్తి యంతయు నీ నిమిషముతో గంగ గలిపితివా?

లక్ష్మ—తల్లీ క్షమించుము నామాటవినుము. అగ్నిసాక్షిగ మావంశకర్తయైన ప్రభాకరుని సాక్షిగ నాయన్నగారి యెడల నాకు గపటబుద్ధి లేదు.

ఉ. చేతికి లేడి చిక్కమి వి • శేషశ్రమంబును బొంది నిన్ప్రహా
శాతశిలీముఖంబు నర • సాస్థలి కూల్పఁగ మోసబుచ్చఁగా
నాతరినట్టులార్చెను ను • రారి యొకండిది నిక్కువంబు
తల్లీ! తపియింపకమ్మ తర • లింతురు నిన్ను త్యజించి పోయినన్.

కావున నిన్ను నేనువిడచి పోవరాదు కొంచె మోర్చితివేని మాయన్న యే రాగలడు.

సీత—ఓరీలక్ష్మణ! పయోముఖ విషకుంభమ వైవజ్ర శిఖామణివలె నెట్లుపన్యసించితివిరా!

చ. వనముల నన్నగారు రిపు • వారికి లోనయి కూలనుండగా
ననునిట భార్యగాఁగొని య • నంత సుఖంబుల గాంచనెంచితే
చెనటి! మదీయదేహమును • జీల్చినగాని నిన్ భజింతు నం
చని తలపంగబోకు ఖలుడా! • యిక నీమది తెల్లమయ్యెరా.

లక్ష్మ—శివశివా! (చెవులు మూసికొని) అన్నన్నా! ఎట్టిమాటలు విన వలసివచ్చెను దైవమా! పాపము శమించుగాక.

ఉ. తల్లి కావటమ్మ గుణ * ధాముడు రాముడు తండ్రికాడె సం
పల్లలితాంగి ! దౌష్ట్యముల * వంబును నాయెడ లేదు దానవుల్
కల్లలువల్క సత్యమని * కానల నొంటిగ నిన్నువీడి నే
మెల్లన బోవ రాక్షసులు * క్రమ్మిరె ! రాముడు నన్ను సైచునే.

సీత—ఛీ దురాత్మా ! ఆవిధంబుగ నన్నగాగు చచ్చితినిరా లక్ష్మణా యని యరువగా నేవ్రా ధర్మపన్నములు చెప్పవచ్చితివా ! నీపాడుబుద్ధి తెలిసెనులే. నేనేపోయి నానాధుని రక్షించుకొనెదనులే. (వెడలబోవును.)

లక్ష్మ—తల్లీ ! త్వరపడకుము. నీవీపర్ణశాల విడచి యీవలకు రాకుము. నేనిపుడే పోయి నాయన్నగారిని దోడ్కొని వచ్చెదను.

సీత—అటులైన వేగబొమ్ము.

లక్ష్మ—యిాన్నై దేవి కేయాపదయు రాకుండ వనస్పతులకు నప్పగించెదను గాక.

సీ. ఓవనస్పతులార ! * యోనగేంద్రములార !
రక్షించుచుండరే * రాముదేవి
కులదైవతములార * గురువరోత్తములార
కావరే యీసీత * గానసముల
పంచభూతములార * ప్రథితగ్రహములార
దనుజానుచుండరే * ధరణిజాత
వనవాసరతులార * ఘనతపోయుతులార
అరయుచుండరె రాము * తరుణినిచట
గీ. రఘుకులోదధి చంద్రుడౌ * రామచంద్రు
డరయబోవుచు నున్నాడ * నంతవరకు
నీమె రక్షించుచుండరే * ప్రేమమీర
అఖిల దేవతలార * మహాత్ములార.

తల్లీ ! యీహద్దుదాటి యీవలకు రాకుము. (నిష్క్రమించును.)

రావణుడు—(యతివేషముతో ప్రవేశించి) జయశంకర ! మహాదేవ్ !

సీత—(తనలో) అక్కటా ! యీయరణ్యమందీ పరివ్రాజకు డెవ్వడు చెప్పుమా నా మరది చెప్పినట్లు రాక్షసు డీవేషమున వచ్చి యుండలేదు కద. అయిన నిచ్చటినుండియె స్వాగతమిచ్చెదను. (ప్రకాశముగ) మహాత్మా! యీదాసురాలిస్వాగతముగైకొని యిచ్చోట దయచేయుడు.

రావ—ఓహో ! సాధ్వీ ! నీభక్తికి మెచ్చితిని ఆయుష్మతివి కమ్ము.

ఉ. ఎవ్వరిపుత్రివీవు హృద ♦ యేశ్వరు డెవ్వడు కాననస్థలి
మవ్వపుమేని కాంతి నన ♦ మాన వికాసను వెల్గజేసి నీ
వివ్వనభూమినొంటి జరి ♦ యింపగ నేమికతంబొ ! చెప్పుమా
జవ్వని ! భీకరాటవుల ♦ జానలు సంచరణంబు సేతురే.

సీత—మహాత్మా ! ఇక్ష్వాకుకుల తిలకుడైన దశరథ మహీపాలుని కోడలను జనక రాజ పుత్రికను శ్రీరామచంద్రు నిల్లాలిని. పితరుల యాజ్ఞచే తమ్ముడైన లక్ష్మణుని నన్ను దోడ్కొని యరణ్యవాసమునకై వచ్చి నానాథుండీ పంచవటీతీరమున వశించుచు నిపుడే యొకలేడిపిల్లను దెచ్చుటకై సమీపమునకు బోయియున్నవాడు.

రావ—ఓహో ఆలాగునా ! నీవే నాసీతవు అక్కటా నీవదృష్టహీనురాలవు కదా.

సీత—మహాత్మా ! ఏమి అట్లనుచున్నారు. నానాథునకు సేమమా ?

రావ—కళ్యాణీ ! సేమమెట్లు కలుగును పిచ్చిదానా !

చ. మతిసెడి తండ్రి పొమ్మనిన ♦ మాతనె రాజ్యము భ్రాతకిచ్చియీ
గతి గడు క్రూరజంతువుల ♦ గానల బుచ్చుశరీర నిన్ను బల్
వెతలను బెట్టుభర్తమగ ♦ వీరుడె ! వెంగలి కాక వానికిన్
సతము సుఖంబుకల్గునన స్వప్నము నమ్మితలోదరీమణీ

సీత — అయ్యా! అందులకై మాకిరువురకును విచారము లేదు.

రావ — నాకు విచారము లేదనుము. అతని విచార మతనితోడనే పోయెను కదా.

సీత — అక్కటా! యతిసార్వభౌమ! ఏమి అట్లనుచున్నారు నానాథు డెందుబోయెను వేగ చెప్పుము.

రావ — చెప్పిన నీవేమి చేయగలవు.

సీత — హా! పూజ్యుడ! యీసందిగ్ధాక్షరముల నన్నేర్చనేల నానాథు సంగతి జెప్పుడు.

రావ — చెప్పుట కేమున్నది. ఆలేడి చేతికి జిక్కకుండుట చేనీమగడు దాని నొక కోలతో గూలనేయ లేడి మాయమై యొకరాక్షసుడై నీనాథుని బరిమార్చెను.

సీత — హా ప్రాణేశ్వరా! (మూర్ఛిల్లెను.)

రావ — జానకీ! లెమ్ము లెమ్ము. ఏల విలపించెదవు

సీత — హా మనోవల్లభ! హా నాథ! యతివర్యా మాలక్ష్మణు డన్న గారిని రక్షింపరాలేదా!

రావ — సీతా!

చ. శరమున లేడిగూల్పగనె • చయ్యన రాక్షసరూపుడై భయం
కరముగ నీపతిన్బొబ్బిడువగా • వడి లక్ష్మణ! హా హతోస్మియం
చురువడి నార్చిచచ్చె నవు • డొయ్యన లక్ష్మణు డేగుదెంచి నీ
వరుని యవస్థగాంచి తన • ప్రాణములన్ విడనాడె దుఃఖియై.

సీత — హా హా మనోహర! హా లక్ష్మణ! మీయిరువురి ప్రాణముల దీయుటకు నేను మృత్యువునైతినా.

ఉ. హా జగదేకసుందర! మహా శ్రీ మహిమాన్విత రామచంద్ర! నీ
రేజహితాన్వయాభరణ! మృ శ్రీ త్యువుకోటను బెట్టినానె వి

భాస్వజిత తేజ ! నీహృదయ * వల్లభి దుఃఖమహాబ్ధి ముంచితే
యీజనకాత్మజాల కిక * నేగతి గూర్చితివో దయాకరా.

అక్కటా లక్ష్మణ ! నా అన్నగారికి భయములేదని నీ వెంత చెప్పినను వినక పోరి పంపించిన మహాపాతకురాలను కదా ! అన్నన్నా నాకింక నెవరుదిక్కు హానాధ ! హాలక్ష్మణ !

రావ—సీతా విచారింపకుము.

ఉ. చచ్చినవారు నీవు పలు * సార్లు తపంబులు చేసి యేశ్చిన
వచ్చెడువారు కారు తల * పంబని లేదిక రాముకంటె నే
హెచ్చుగజాచిమాళినిడి * యేలెద నావెను వెంటరమ్ము నా
సచ్చరితంబు గీర్తి విన * జయ్యన నన్ను ననుగ్రహింపవే.

కావున నీవు శోకముడిగి నా వెంటరమ్ము.

సీత—(తనలో) ఓహో యీయతి యొక మాయారాక్షసుడు కావచ్చును లేకున్న నిట్లు పలుకడు. (ప్రకాశము) ఓరీ కపట యతి వేషధారీ నీ వెవ్వండవు.

రావ—నీవు నన్నోరీయని పిలచినను నాకు సంతోషమే సుమి ! నేను పులస్త్యబ్రహ్మ వంశములోనివాడను రావణుడని యందురు.

చ. పవలున భాస్కరుండు హిమ * భానుడు రేలను నాకుఛత్రముల్
దివిజులు కింకరుల్ సకల * దిక్కులు నాపదపద్మదాస్యతన్
దవిని చరించు మారుతక ప్ర * తాపము విన్నభయంబుచేత నీ
భువనములెల్ల గంపిలును * బోటిరో ! మాటలు వేయి యేటికే.

కావున నీవు నన్ను జేకొంటివేని జగంబులకెల్ల భజనీయురాలవగుదువు.

సీత—ఓరీ దుష్టరావణ ! ఏమిరా ! ప్రేలెదవు.

చ. నక్కయొకకండు కందరము * నక్ హరిలేదని దాని మాంసమున్
గ్రక్కున దస్కరించుగతి * రాముడు లేడని పర్ణశాలలో

ముష్కరుడి ! నన్ను జేకొనెదు ♦ బుద్ధినివచ్చితె ! నీశిరంబు వే
వ్రక్కలుగా శపియించెదను ♦ బాలిశ ! వచ్చినతోవ బట్టుము.

ఓరీ మదాంధ రాక్షసాధమ ! పర్ణశాలలో నాకువి యొక్కతె యున్నది కదా యని తస్కరింపదలంచివేమొ అట్లు సాగదు సుమీ. నానాథుడిప్పుడేవచ్చి నిన్ను హతమార్పగలడు.

రావ — నీనాథుడింకను వచ్చుననియే చెప్పుచుంటివా ? నీవనాథవైతివి కదాయని జాలిదలచి నిన్నుద్ధరింపదలచితి నెందుకు బెట్టుసరి చేసెదవు.

శా. ఆలంకాపురి నాసుధాకరమణీ ♦ వాబద్ధసౌధాల, ర
త్నాలంకారిత కాంచనోల్లసిత ప ♦ ర్యంకస్థలిన్ దేవతా
రోలంబాలక లెల్ల చామరము లా ♦ లోలస్థితిన్ వీవ నా
తోలంకేశ్వరివై సమస్తసుఖముల్ ♦ సంతోషంబునన్ బొందుమా.

సీత — ఓరీ పతివ్రతామానభంగపరాయణా! రావణా! ఏమి కాప్రేలెదవు.

ఉ. ఆరఘురామచంద్రుని మ ♦ హోపలయాగ్నిని మించు నాశరా
సారపుమాటలొక్కమొగి ♦ సత్వరమునను నిండి నిన్ను గం
భీరత నావరించి పృథి ♦ వీస్థలి గూల్చిననాడు నన్ను ని
ష్కారణ మిట్టులన్నకలు ♦ షంపు ఫలంబును బుద్ధిదల్పవో.

కావున బుద్ధికల్గి యీవలకుబొమ్ము.

రావ — శాతోదరీ నీభర్త నన్నేకూల్చునో నేనే నీమగనిని కూల్తునో నీవే చూచెదవుగాక! నానిజరూపమును జూడుము. (చూపును)

సీత — హా ప్రాణేశ్వరా. (మూర్ఛవడును.)

రావ — యీమెను నారథంబున బెట్టికొని రామాదులు రాకుండ లంకాపురమునకు గొంపోయెదనుగాక.

(తెరపడును నిష్క్రమణము.)

5 రంగము—అరణ్యము.

రాముడు—(ప్రవేశించును) అక్కటా! ఏమికానున్నదో కదా!

గీ. గోలచే లేడి నిలగూల్ప * గ్రూరదైత్యు
నాకృతిని దాల్చి హా లక్ష్మణా! * హతోస్మి
యనుచుచు నావలె నరచె నా * యనుజుడాత్మ
నెంత శంకించెనో నాదు * కాంతతోడ.

ఔరా! నాయెడమకన్నదరుచున్నది ఏమిచెపుమూ! (ముందుజూచి) అక్కటా! జానకినొంటిగ విడచి లక్ష్మణుం డిటకే వచ్చుచున్నాడుకదా!

లక్ష్మ—(ప్రవేశించును.)

రాము—తమ్ముడా! పర్ణశాలలో సీత నొంటిగ విడచి వచ్చితివా! అక్కటా! యెంతపని చేసితివిరా!

లక్ష్మ—అన్నయ్యా! హా లక్ష్మణ! హతోస్మియనువాక్యంబుల నాలకించి వైదేహి మీకాపదగలిగినట్లు శంకించి నన్ను బొమ్మని బలవంతముసేయ

చ. దనుజుల యార్పుకాని మన ♦ దాశరథిధ్వని కాదటంచు నెం
తని బ్రమాలిచెప్పిన ర ♦ వంతయు నానుడులాలకింప కా
జనకజ కిన్కచేత బరు ♦ షంబులనాడ సహింపలేక యీ
వనముల నిన్ను రోయుచును ♦ వచ్చితినయ్య సహోదరాగ్రణీ.

రాము—ఇసీ తమ్ముడా! ఎంతపని చేసితివోయి!

చ ఉచితమె! నీకు! సీత పరు ♦ షోక్తుల నాడ దురాభిమానివై
సుచరితనామె నొంటి దను ♦ జుల్ చరియించెడు కానలందు ధీ
రచనదొలంగి వీడుదువె! ♦ రాముడురాడోకో సీత క్రూరపుల్
వచనములెల్ల జంపినవె! ♦ వత్స! ధరాత్మజ యింకదక్కునే.

లక్ష్మ—స్వామి! అక్కడ నన్నామె పోరి పంపుటచే వచ్చితిని. క్షమింపుడు. పోయి వెతకుదమురండు. ముందే యుండగలదు.

(తెరలేవ పర్ణశాల కనుపడును)

రాము—(నడచి) హా తమ్ముడా ! అదృష్టహీనులము కదా. చూడు నాపర్ణశాల యెట్లున్నదో

ఉ. కాయలు దుళ్లగొట్టిన ♦ గంబున బిల్లలులేనియట్టి వి
ద్యాయతనంబనంగ మిహా ♦ రాంశుని బాసినరాత్రి యట్ల వా
లాయము సీతలేక సిరు ♦ లన్విడనాడిన పర్ణశాల వ
త్సా ! యెటులున్నదోకనుము ♦ తప్పకదైత్యుల జిక్కియుండెడిన్.

అక్కటా ! ఎంతపని చేసితి వ్రాయి.

లక్ష్మ—అమ్మా ! వైదేహి(అటునిటు వెదకి) తల్లీ జానకి ! హా పాపాత్ముడను కదా ! యికనెక్కడి సీత పర్ణశాలలో లేదుకదా !

రాము—(కూలబడి) హా చచ్చితినికదా !

గీ. పర్ణశాలను సీత క ♦ న్పడగ లేద
టన్న పరుషాక్షరములు నా ♦ యంతరాత్మ
దగులబెట్టగ జొచ్చె వ ♦ త్సా ! యికేడ
రామునకు నెల్లెనూకలు ♦ భూమిమీద.

హా జానకీ ! (మూర్ఛబడును.)

లక్ష్మ—(రాముని జేరి) హా ! యీమహారాజున కెంతయవస్థదెచ్చితిని

కం. అన్నా ! ధైర్యము వీడకు
మన్నా ! నీయన్నను మిన్న ♦ సడవిగలిపె నీ
చెన్నటి యేయెడ జానకి
యున్నదో ! రోయక యెదుగిఖ ♦ మొందుటదగు నే.

రాము—తమ్ముడా ! యికెక్కడి జానకిరా,

ఉ. ఎప్పుడు జానకిన్విడచి ♦ యేత్తెర నాకొఱకీవు వచ్చితో
అప్పుడె క్రూరరాక్షసుల ♦ హాస్తమునం బడె బల్మిచేతనే

తిప్పలబెట్టిరో యనుల ♦ దీసిరో! రక్తము ద్రావినారో! హా
చెప్పగజాల నాకను ♦ జీవముతో బనియేల తమ్ముడా!

లక్ష్మ—రామచంద్రా! నీయుదయకుటీరమునకు జిచ్చుముట్టించిన లక్ష్మణహతకు నింక దమ్ముడా యని పిలువకుము. పూజ్యురా లైన వదినెగారిని రాక్షసులవాత ద్రోసి అన్నగారికి ప్రాణసంకటము దెచ్చిన మహాపాతకుడను కాని ఆమె రాక్షసులవాత నే చిక్కెనో క్రూరమృగములే హరించినవో పరీక్షించిన వెనుక మన మిరువురమును ప్రాణత్యాగమును జేసికొందము. కావున వెదకుదము రమ్ము.

రామ—వత్సా! అట్లైన లెమ్ము అనుభవనీయమిట్లుండ మన మెందులకును కర్తలము కాము. కావున నడచి యరణ్యమున బరీక్షింతము.

లక్ష్మ—(పరీక్షించి) అన్నయ్యా! యీపర్ణశాలనుండి జానకి యేగిన పదచిహ్నములు కానరావు. ఇందు మాత్రమొక పురుషుని పదముద్రలగపడుచున్నవి. కాని వాడును మరలిపోయిన చరణ సరణియు గానవచ్చుట లేదు యేమిచిత్రమో తెలియకున్నది కదా.

రామ—(చూచి) హా పితృగాల! వైదేహీ!

ఆ. వె. దివికి నెగసినావు! ♦ భువిదూరిపోయితో
తెలియరాదు నీదు ♦ తెరువునుంత
నామనంబు కనుగొ ♦ నంగనంతర్హిత
వై వనాళినడగినావు! ♦ చెలియా.

లక్ష్మ—ఇదికడు విచిత్రముగనున్నది. అన్నా యీప్రాంతముల వెతకుదము రమ్ము. (ఇద్దరు నిష్క్రమించెదరు)

6 రంగము—వనాంతరము.

రామ—హా వైదేహీ ! ఎందుబోయితివి? యెటనుంటివి? ఓమృగం బులార !

సీ. కానవా కలకంఠ కలకంఠ నాభార్య
నరసితే హరిణమా హరిణ నేత్ర
పికము చూడలేదె పికవాణినాప్రియ
కలభమా కాంచితే కలభగమన
తిలకసుందరఫాల తిలకమా చూచితే
హరిమధ్యగానవే హరివరంబ
పాటలా కంటివే పాటలాధరి సీత
భ్రమర వీక్షించితే భ్రమరచికుర

గీ. సాలహింతాల కుటజర సాలులార
నామనోహరిసీత గన్నారె మీరు
అక్కటా ! యింకనెక్కడి యవనిజాత
రామ జీవితమింక నిరాశయయ్యె.

లక్ష్మ—అన్నయ్యా యిందు వెతకుదము రమ్ము. (నడతురు)

రాము—హా జనక రాజనందని ! నీచందము నీయందము నాకనుల కొకసారి చూపి యానందంబొసగరాదా ! నేనేమి పాపము జేసితిని.

ఉ. చిక్కుల బెట్టనెంచి వన సీమలనెందుల డాగినావె హా
చక్కెరబొమ్మ నీవు సర సత్వ వహించ గదమూలముల్
చక్కని పిండివంటలగు సాధ్వీరో దర్భలె తూలతల్పమా
రక్కసడొంకలున్న వన రాజి యయోధ్యయె సుమ్మ జానకీ
హా జానకీ దయయుంచి యొకసారి నీ సందర్శనంబీయవా,

లక్ష్మ.—ఆహా! మాయన్నగారి కెంత దురవస్థను దెచ్చితివి దైవమా!

రాము—హా నిమికులవన చంద్రికా!

గీ. నళినదళ నేత్ర! నిను బాసి ♦ నారి లేని
చాపమన జంద్రికలు లేని ♦ చంద్రుడనగ
తేజమెడలిన రవిభాతి ♦ దీనదశను
బొందియున్నాడనుమ్మి రా ♦ కేందువదన!

లక్ష్మ—అన్నయ్యా! ఆ మహాసాధ్వీవియోగము జగములకే దుర్దశను గలిగింప మనకు దీనదశయుంటు ఆశ్చర్యమా! నడువుము ముందు జూచెదము.

రాము—[నడచిచూచి] తమ్ముడా!

సీ. ఏకొండరా! యిదియింత ♦ దుస్సహమయ్యె
లక్ష్మ— కొండ కాదయ్యా కా ♦ కుత్స్థతిలక
రాము— కాకేమిరా! కండ్ల ♦ గట్టినట్టుల దోచె
లక్ష్మ— రఘురామ! దండకా ♦ రణ్యసీమ
రాము— వత్స! యిందేటికి ♦ వచ్చితి మెఱిగింపు
లక్ష్మ— గురునాజ్ఞ వనముల ♦ దిరుగ రామె
రాము— వనుల ద్రిమ్మరగ నె ♦ వ్వరము వచ్చితిమన్న
లక్ష్మ— నీవును సీతయు ♦ నేను కాదె!
రాము—గీ. సీత లేదేమిరా మన ♦ చెంత వత్స!
లక్ష్మ— పర్ణశాలను దనుజుల ♦ పాలబడదె
రాము— హా మనోహారి! హాసీత ♦ హామదీయ
ప్రాణమా! జానకీ! నన్ను ♦ బాసినావె.

లక్ష్మ—అక్కటా! మాయన్నగారి కంతకంతకు మతిపోవుచున్నదే! యేమిదిక్కు దైవమా!

రాము—[త్వరలో] తమ్ముడా తమ్ముడ! ఆదిగోరా సీత కనుపడినది.

లక్ష్మ—అన్నా ! ఏదీ ! యెచ్చట?

రాము—అదిగో, ఆవైపు జూడుమూ.

సీ. కనకచేలముగట్టి ♦ వనజాక్షిచరణముల్
మడిచికూర్చుండెన ♦ య్యెడనుగనుమ

లక్ష్మ—శ్రీరామ ! విరియబూ ♦ చినరేలపొదకాని
జానకికాదు ని ♦ శ్చలతగనుమ

రాము—ముకమండలంబదే ♦ మోకాళ్ళపైనాని
మనవైపు నవ్వుతో ♦ గనుటలేదె

లక్ష్మ—రేలపూబొదమీద ♦ వ్రాలిన గిరిమల్లి
కా గుళుచ్ఛంబె ♦ ముఖంబుకాదు

రాము—గీ. తమ్ముడా మోసపోతి జి ♦ త్తమ్ముచెదరె
నెందుజూచిన జానకి ♦ చంద మెదుట
గనులదోచునుకాని ని ♦ క్కంబుకాదు
వెర్రియెత్తెదు నేమందు ♦ విధివశమున.

లక్ష్మ—అన్నయ్యా ! మనస్సు స్వస్థత జేసికొనుము. పిపాసచే నొకవేళ గోదావరినదీ జలంబులకై పోయియున్నదేమో. కనుగొందము రమ్ము.

రాము—వెర్రితమ్ముడా ! భూమిమీద నదులుల జాడలేక గోదావరికి మాత్రి మెట్లుపోయినదని తలంచెదవు. అయిన నీగోదావరిని గూడ ప్రార్థించిచూతము తల్లీ ! గోదావరీస్రవంతిసీ [చేతులు మొగిచి]

గీ. నాసికాత్ర్యంబకమున జ ♦ న్మంబుగాంచి
వసుధజీవులకెల్ల జీ ♦ వనమొసంగి
పూర్వజలరాశిచేరు నో ♦ పుణ్యరాశి
భూమిసుతదెల్పు గోదావ ♦ రీమతల్లి.

అక్కటా ! ఇదియును కలుకదయ్యె నింకెందు బోవుదమురా ?

లక్ష్మ—అన్నయ్యా ! యిట్లొకసారి రమ్ము.

రాము—(నడచిచూచి) అమ్మయ్య దొరికినదిరా సీత ! అల్లదే చూడుము.

చ. కిసలయపాణి సీతయదె ! కేసరి వృక్షముపొంతనిల్చి చే
విసరుచు నన్నురమ్మనుచు • వేమరుబిల్వగజొచ్చె జూడుమా
లక్ష్మ—కుసుమలతామతల్లి యదె ! • కొంచెపుగాలికి నల్లలాడ భూ
మిసుతయెయంచు నీమది భ్ర • మించితి వంతియెకాని సీతయే

రాము—అన్నన్నా ! యెంతమోసము జెందితినిరా తమ్ముడా! ఓపృథివ్యాది పంచభూతములార ! ఓప్రభాకరనిశాకరాది నవగ్రహములార ! ఓ సకల జీవకోటులార ! ఓ నిర్ఝరీగిరి వనంబులార!

చ. పరమపవిత్రురాలు రవి• వంశ సుధాకర రేఖ నామనో
హరి జనకాత్మజాత వసు • లాత్మధరిత్రి నయోనిజాత భీ
కరవనసీమ గోల్పడితి • గాంచిన నాకెఱిగింపరే ! మహా
త్తరసుకృతంబు కల్గుదయ • దాల్పరె ! మీకు నమస్కరించెదన్

(నమస్కరించి అటునిటుజూచి) ఔరా ! ఎంతవిపరీతము ! నాచేత సంబోధింపబడిన వారొక్కరును ప్రతివచనం బీయకున్నవారే ? సరే కానిమ్ము. తమ్ముడా ! (ధనువు నెక్కువెట్టి) నామాటకు బ్రత్యుత్తరం బీయని భూతగ్రహవిశిష్టమైన యీ భూమండలమును నాబాణాగ్నిచే భస్మీభూతము గావించెదను జూడుమా.

లక్ష్మ—అన్నయ్యా ! తాళుము. తాళుము.

రాము—[తమ్ముని దోసిపైచి] ఛీ, యటుల దొలగుము. (ఆకసము వంకజూచి) హా పాపప్రపంచకమ !

శా. నాకళ్యాణియె నామనోహరియె నా • నారీశిరోరత్నమే
లోకంబందున దోషమున్నయపు డీ • లోకాళితో నాకదే

లా ! కల్లోలము కాగ సర్వమును సం ♦ హారంబుగావింతు నా
రాకాచంద్రదప్రభాకరరాది గ్రహతా ♦ రామండలిన్ దుల్చేదన్.
[ఆగ్రహముతో దిక్కులజూచును.]
లక్ష్మ--అన్నయ్యా ! ఎందుల కీక్రోధము యెవ్వడో అపరాధము
సేయు జగంబులపై నాగ్రహించెదవా !
రాము—తమ్ముడా ! నాకోపమెందులకనెదవా ?
చ. హరిహరబ్రహ్మముఖ్య ♦ దివిజావళి నూమక ఘోరశస్త్రదు
ర్భరవిలయాగ్ని కీలలకు ♦ భావమునందున దల్లడిల్లి నా
తరుణిని దెచ్చియిచ్చి ♦ ప్రముదంబున నన్ను భజింత్రు తక్కినన్
ధరణిని సర్వదేవతల ♦ దగ్ధముగా నొనరింతుతమ్ముడా.
లక్ష్మ—అన్నయ్యా ! సర్వజగముల రక్షింపజాలిన నీవే యిటు లాగ్రహించి లోకముల కాపదలుమూడవా ! యెవ్వడో ఒక్కతులువ మనకపకారము సేయు జగంబుల సంహరింపదగునా ! నీవు లోకారాధ్యుడవు, లోకశరణ్యుండవు, లోకకర్తవు, స్వామీ ! శాంతింపుము.
రాము—హుం అన్నన్నా ! నాయాగ్రహము నన్నే దహించుచున్నది కదా ! మంచిది తమ్ముడా ! యిపుడు కర్తవ్యమేమి.
లక్ష్మ—స్వామీ ! ఆ క్రేవ నేవో చచ్చిపడిన ఖరవాహనములు కనిపించుచున్నవి. వాటికి గారణమరయుదమురమ్ము (నడచిచూచి) అన్నయ్యా యిక్కడ నొక్కరథము ఆకసమునుండి విరిగి పడినట్లును కొన్ని పుష్పమాలికలును గానవచ్చుచున్నది. అల్లవే చంపబడిన ఖరవాహనము లాయెడ గూలినవి. కారణమేమో తెలియరాదు.
రాము—ఇందుచే గగనసంచారితో నెవ్వరితోడనో పోరు గలిగినట్లు స్పష్టపడినది.

లక్ష్మ—అదిగో ఆముందేదో కూలినట్లున్నది.

రాము—ఔనౌను. ఆ పర్వతాకారుడైన పక్షిరాజు మన జానకిని మ్రింగియున్న వాడేమోకదా. (తెరలేవగా జటాయువు కనుపడును.)

లక్ష్మ—అన్నయ్యా! యీ విహంగనాథుని వృత్తాంత మరయక త్వరపడకుము.

రాము—శత్రువును సేమమడిగియా చంపుట కావున వీని వధింపక మానను. (బాణము సంధించును.)

జటాయు—మహాత్మా రామచంద్ర! చంపకుము చంపకుము. నేను నీపితృసఖుండను. జటాయువను పక్షినాథుడను. మీరులేని సమయమున నీదేవి జానకిని రావణుండు కొంపోవుచుండ నేను వానినడ్డుకొని ఛత్రమును, వాహనములను, కవచమును, చాపంబును, రథంబును దున్మింప విరథుండై సీత నక్కడడించి దప్పిచే నాయాసపడుచున్న నా రెక్కల దున్మించి కూల్చి సీతాదేవి నెత్తికొని పోయెను. నేనీవార్త నీ కెఱింగింప జీవముల బిడికిలించుకొని యున్నవాడ. నన్ను నీతండ్రియట్లు భావించి యగ్నిసంస్కారము చేయవేడెదను. నేనిదే ప్రాణముల విడచుచున్నాను.

రాము—హా పితృసఖా! హా పరోపకారపారీణ! పక్షికులవతంసమ.

చ. హితునికుమారుభార్య నొక • డెత్తుకుపోవుచునుండ గ్రోధఘూ
ర్ణితహృదయుండవై వివిధ • రీతుల శాత్రవుదూల్చి కూలితే
పతగకులాధినాథ! గుణ వంతులు యోగ్యులుబోలెచుపట్ల జీ
వితము దృణంబుగాదలచి • నీకుట నైజముకాదె; పూజ్యుడా.

తమ్ముడా! మనతండ్రి కగ్నిసంస్కారము సేయుటకు మనమునోచకున్నను పితృతుల్యుడైన యీఖగనాథున కగ్నిసంస్కారాదుల జేయ

వలయును మరియు నోరోరి రావణ! నీవు నాయాగ్రహాగ్నికిం ధన
ప్రాయుడవై తివిరా, పరికర్కంధర

ఉ శిష్టజనంబులన్ గరుణ • చే బరిపాలన సేయ గర్తయున్
దుష్టుల సంహరింప లయ • ధూర్జటియైన నన్నుఁ సతీమణీ
నష్టునిగాగ జేయదగునా • నిను భ్రాతృపతీసుతాదిక
భ్రష్టునిజేసి క్రోధశిఖ • బ్రాణములన్ హరియింపకుందు నే.

లక్ష్మ—ఓరోరి నిశాచరాధమ;

ఉ. రావణ నీదు పాపపు శి • రంబుల ద్రుంపగ రాముపాలు శో
కావిలునైన నీయనుచ • రాళివధింపగ నాదుపాలురా ,
పావనిసీత నొంటి బల • వంతముగా హరియించినంత నే
జీవముతో సుఖింతువె • నశింపవె భ్రాతృసుతాదిసేనతో.

(ఇద్దరు నిష్క్రమింతురు.)

7 వ రంగము;—వనాంతరము.

[కబంధకళేబర విశిష్టము రామలక్ష్మణులు ప్రవేశించెదరు]

రాము—తమ్ముడా మన మతిక్రమించిన యరణ్యముకంటె నీవన మతి భయంకరమై యున్నది. జానకిని గొంపోయి రావణు డిం దుండలేదుకదా ?

లక్ష్మ—యీగహనసీమ రాక్షసులకు నివాసభూమి కావచ్చును.

అయోముఖి—(రాక్షసిప్రవేశించి) ఓహోహో నేను పుట్టినపిమ్మట నింత చక్కనివారిని జూడలేదు. వీరిని జూడగనే చంపి తినవలె నన్న బుద్ధిపోయి సరసులగా జేసికొని కామసౌఖ్యమనుభవింప నూహకలుగుచున్నది. (ప్రకాశము) ఓ మానవులార ; మహావ్వా యెంత చక్కగనుంటిరిరా. (లక్ష్మణుని గౌగలించు కొనును.)

రాము—తమ్ముఁడా! శూర్పణఖకు జేసిన యలంకారములే దీనికి నొసంగి సంతోషపరచుము.

లక్ష్మ—ఓసీ! నిశాటిని నీకామాంధకార మడచెదను రారమ్ము.కత్తితో జన్నులఁగోయును.

అయో—అరే అరే చచ్చితినిరా విధవా ? [పారిపోవును.]

రాము—వత్సా! లక్ష్మణ! ఇదిమొదలు మనకు దానవవధ నిత్యకర్మనుమి !

లక్ష్మ—అన్నా! అట్లుకాదు. ప్రతిక్షణ కర్మయనుడు.

కబంధుడు—వహవ్వా! నేను కదలలేకపోయినను, చాలకాలమునకు నాకు మనుష్యమాంసమును భగవంతుడు లభింపజేసినాడు కదా [చేతులతో రామలక్ష్మణుల నాకర్షించును.] ఓరీయింకెందుఖోగలరా నానోట జిక్కినారు లెండి.

రాము—తమ్ముఁడా! యివేవో రాక్షసబాహువులు మనల నాకర్షించినవి. నీవాభుజమును నరుకుము నేనీబాహువును దుంచెదను [అట్లు సేయుదురు]

కబంధు—ఓహో మానవులార! యెంతకాలమైనను నా బాహువులు నరుకువారు నాకు గానబడలేదు. మీ రెవ్వరో మీవృత్తాంతమేదో చెప్పుడు మీకు బుణ్యముండును.

లక్ష్మ—ఓరీ! యీ మహాత్ముడు రామచంద్రుడు, నేనులక్ష్మణుడను మేము యిక్ష్వాకుకులజులైన దశరథుని పుత్రులము. మావదినగారైన సీతాదేవిని పంచవటీతీరమున గోల్పోయి వెతకుచు నిటు వచ్చినాము.

కబంధు—ఆహా మహాత్ములార! మాంపాహి మాంపాహి నాకింద్రుని మాట స్ఫురణకు వచ్చినది. నేను స్థూలశరీరుండను ముని ని. బరిహాసించి మూడు యోజనముల పొడవుగల బాహువులుగల

యిట్టిస్థూలశరీరమును శాపవశమున గాంచినాను. అప్పుడీశాప విమోచనక్రమము నెఱింగింపు డన రామలక్ష్మణులువచ్చినీబాహువెప్పుడు నరుకుదురో అప్పుడేనీకు శాపవిమోచనమని యానతిచ్చెనటులే నాశాపవిమోచనమైనది. బ్రహ్మదత్త వర ప్రభావంబునగర్వించి కామరూపినై సంచరించు ధనువనెడు గంధర్వుండను. మీకివేవందనములు.

రాము—ఓయీ నీవు సీతావృత్తాంతము నేమైననెఱుంగుదువా ?

కబంధు —స్వామీ! నాశరీరమును దహించితిరేని దివ్యశరీరమును దాల్చి సర్వము నెఱింగించెదను.

రాము—తమ్ముఁడా ! అగ్నిసంస్కారపు ముచ్చటమనకింకను తీరలేదు వీనిని దహింపుము.

లక్ష్మ—చిత్తము. (వానినీడ్చికొనిపోయి దహించును.)

(తెరలో) రామలక్ష్మణులార ! రావణుఁడు జానకీదేవిని దస్కరించి యాకాశమార్గమున బోయెను. వానిని సంహరించుటకు వాలిచే బహిష్కరింపబడిన సుగ్రీవ హనుమదాదులు ఋష్యమూకంబున నున్నవారు. వారితో సఖ్యము జేసికొంటివేని యారావణునోర్చి నీభార్యను నీకు జేర్పగలరు. ఈమార్గమున బోయిన పంపాసరోవరమును శబర్యాశ్రమమును కనుపట్టు ఆశబరివలన తన్మార్గ మెఱింగి ఋష్యమూకంబున బ్రవేశించుడు మీకు శుభంబగుగాక నేనికపోయెదను.

రాము—తమ్ముఁడా ఋష్యమూకమునకు దారితీయుము.

(నిష్క్రమించెదరు.)





శ్రీ

# సంపూర్ణ రామాయణ నాటకము.

## అష్టమాంకము.

### 1 వ రంగము—ఋష్యమూకము.

[సుగ్రీవ హనుమంతాది వానరులు ప్రవేశించెదరు.]

సుగ్రీ—హనుమంతా! ఆవైపుజూడుమా!

ఉ. ఘోరశరాసనంబులును * గోలలు, దూణముదాల్చి మానియా
కారములన్ ధరించి వడి ♦ గా మనతావును జేరవచ్చుచు
న్నారదె పుర్షులిద్దరు మ ♦ నంబుదలంకెడు వాలి పంప నీ
తీరున వచ్చెనంచును మ ♦ దిన్ దలపోసెద యోజసేయుమా.

హనుమం—స్వామి! సూర్యనందన వాలిభయముచే నీవట్లు తలంచుచున్నావుకాని తమ కేమియుపచారము జేసితిమని వారిందుల కొడంబడుదురు! యింతకును ధర్మాధర్మము లరయకుందురా! ఒకవేళ దుందుడుకుచేత వచ్చినను వారికి ధర్మముదెల్పి బుద్ధి మరలింపకుందుమా!

సుగ్రీ—అటులైన నీవు కొండదిగి నారికెదురేగి వారిరాకకుగారణమరయుము. అంతవరకు నేనీగుహాలో నుండెదను.

హను—చిత్తము. (దిగి యెదురువచ్చును.)

రాము—తమ్ముడా! శబరిచెప్పిన ఋష్యమూక మిదియేకావచ్చును. ఆహా! యిది యెంతనివాసయోగ్యమైనది! అందుచేతనే యిందు మాతంగముని యాశ్రమము నిర్మించుకొని తపమొనరించెను.

హను—(సమీపించి) మహాత్ములార ! మీకివె పదివేలవందనములు.

మీరెవ్వరో యెఱింగించి నన్ను కృతార్థుని జేయుడు.

లక్ష్మ—కపిశ్రేష్ఠ !

ఉ. ఈతడు రామచంద్రుడు ది ♦ నేశకులార్ణవ చంద్రుడేను తత్

భ్రాతను లక్ష్మణుండ బితృ ♦ వాక్యము దీర్పగ దండకాటవిన్

బ్రీతిగ జేరి యందు నొక ♦ రాక్షసుచే రఘురాము భార్య యా

సీతను గోలుపోయి కపి ♦ శేఖర ! వచ్చితి మీ విధంబునన్.

కాని నీ వెవ్వండవు.

హను—మహాత్ములార ! నేనంజనీగర్భంబున వాయుదేవునకు పుట్టిన హనుమంతుడను వాడను కపిసార్వభౌముండైన సుగ్రీవుని మంత్రిని ఆ సుగ్రీవుం డీ ఋష్యమూకంబున నున్నవాడు. మీరాతనితో సఖ్యము జేసికొంటిరేని మీ కార్యము సఫలము కాగలదు.

రాము—మారుతీ ! మాకంతె గావలసిన దేమున్నది. రమ్ము పోవుదము (కొండ నెక్కుదురు)

హను—అయ్యా ! కపిసార్వభౌమ సుగ్రీవ ! వచ్చి యీ పుణ్యపురుషుల సందర్శించి కృతార్థుడవు కమ్ము.

సుగ్రీ—(ప్రవేశించి) పరమపురుషులార ! నాయభివందనముల నంగీకరించి నాయాతిథ్యము నందుడు.

రాము—సుగ్రీవ ! నీకు భద్రము కలుగుగాక !

సుగ్రీ—పూజ్యులార ! మీరీపచ్చరాతి చపయపై నాదెసేయుడు (అంద రుకూర్చుందురు.)

హను—సుగ్రీవ సార్వభౌమ ! యీ మహాత్ములు రవివంశజులైన రామలక్ష్మణులు. తండ్రిగారియాజ్ఞచే వనవాసంబు సేయవచ్చి దండకారణ్యంబున సీతను రాక్షసులచే గోల్పోయి యీ మార్గమున వెదకుచువచ్చినారట.

సుగ్రీ—ఓహో ! అలాగునా ! ఓదశరథ మహీపాల పుత్రులార !
ఆసీతాపహార దనుజుడెవ్వడో మీకు దెలిసెనా !

రాము—సుగ్రీవా ! ఆదౌర్మార్గమును సహింపజాలక వానితో రణ మొనరించి కృతపక్షుండై పడిపోయిన జటాయువను పక్షీంద్రుని వలన వాడు రావణుడని వినియున్నాము.

సుగ్రీ—ఓహో అలాగునా ! అటులైన నాకిపుడు స్మృతికి వచ్చినది. యొకనాడు హా రాము ! హా రామయను నార్తధ్వనితో గొన్ని యాభరణములు గట్టినమూట మాగిరిమీదబడినది. నేనంతట బైకిజూడ గగనంబున నొక్కయంగనామణిని దోడ్కొనిపోవు రాక్షసునిజూచితి. వాడు దక్షిణాభిముఖుడై పోయెను. అప్పుడా భూషణములమూటను విప్పిచూచి యొకచెట్టుతొఱ్ఱలో భద్ర పరచితిని. తెచ్చియిచ్చెద జూడుడు (తెచ్చియిచ్చును)

రాము—(పుచ్చుకొని విప్పిచూచి కన్నులనద్దుకొని) హాజనకీభూష ణంబులార !

ఉ. పూతచరిత్ర సీతవస • భూషలగాసక రోసిరోసి డీ
వ్రాతత శోకమొందుచును • ప్రాణముబాయును రాముడంచు నీ
రీతిగనన్ను జేరి తెలు • రీచు నీనెకు రత్నహారమా !
ఖ్యాతిగసజ్జనుల్ హితుల • యార్తినిసైపరుకాదె ! ధాత్రిలో.

హా మైథిలీ ! రామమయజీవితా సీతా ! ఆదుష్టరాక్షసునిచే నెంతశ్రమ పడితివోకదా !

సుగ్రీ—మహాత్మా ! ప్రాకృతపురుషు లట్లులతపించెదరు. ధైర్యమువలం బించుము.

లక్ష్మ—నిక్కంబుగ నీభూషణంబులు మావదినెగారివే. యీవస్త్రశకల ము మాతల్లికట్టిన కావివల్కములోనిదే.

రాము—తమ్ముడా ! యింకను సందియమా !

చ. అనయము బంధుసతతులు ♦ హర్షము చేగనుచుండ బెండ్లి వే
ళను మొగమింతవంచి సభి ♦ లాసను దెల్పెడు వాలుచూపులన్
సనుగనుచున్న నాజనక ♦ నందని కంఠమునందు నేను వే
సిన నవరత్నహారమని ♦ చెప్పగసంశయ మేమితమ్ముడా.

లక్ష్మ—అన్నయ్యా ! నిశ్చయముగ నామి దేయిది.

హను—రామచంద్ర ! నీవీసుగ్రీవుని సఖ్యమువలన నపగతభార్యా
ప్రాప్తినందగలవు. శత్రువధ జేయగలవు.

రాము—సుగ్రీవ ! కపిసార్వభౌమ! చేతులబట్టుకొని

చ. అవనిజగోలుపోతి హృద * యంబు వికావికలయ్యె గండ్లకున్
భువనములే నశింపబడి * పోయినయట్టుల గానవచ్చె నే
రవికులమందు బుట్టితిని * రమ్యగుణోత్తర ! నీవు సూర్యసం
భవుడవు నాకుబంధుడవు * భ్రాతను నన్నటులుద్ధరింతువో.

లక్ష్మ—(తనలో) అక్కటా సకలజీవకోటులకును రక్షకుడైన రామ
చంద్రుడు నేడొక్కవానరుని బ్రార్థింపవలసి వచ్చెనుగదా! హా
దుర్విధీ !

రాము—సుగ్రీవా ! యికనానై దేహిని నాకుజేర్చు నుపాయుంబాలో
చింపుమా!

సుగ్రీ—రామచంద్రమూర్తీ ! నీవు సంతాపపడకుము. ఈసప్తసముద్ర
మధ్యభాగంబున నెందున్ననువెదకి జానకీదేవిని నీకుజేర్చెదను
అందులకై మనమగ్నిసాక్షిగ సఖ్యంబు జేసికొనవలయును.

రాము—వానరనాథా! అట్లయిన మనయుభయులకును సేమమేకదా
అగ్నిసాక్షిగా వించుకొందము.

సుగ్రీ—స్వామి యిదేయగ్నిగుండము. (దానిమీద జేతులుంచును.)

రాము—[చేతులగ్నిమీదనుంచును.]

సుగ్రీ. రాము—గీ. అగ్నిసాక్షిగ మనకు • సఖ్యంబునుమ్మా
నిరత మన్యోన్యకార్యముల్ నెరపుపట్ల
ప్రాణములనైన ధారవ్రా యంగవలయు
విబుధవరా దెన్నటికినైన • బుడమిలోన.

హను—తథాస్తు! రామచంద్రమూర్తి! మీకార్యమునకై మేమంద
రమును మా ప్రాణముల దార వ్రాసెదము. సందియము లేదు.
కాని ముందుగ మీరొక కార్యము చేయవలయును.

రాము—సర్వదా సిద్ధముగ నున్నవాడ ఆనతిండు.

సుగ్రీ—స్వామి! భార్యా వియోగదుఃఖముచే మీరెట్లు తపించుచు
న్నారో నేనును అట్లేశోకించుచున్నాను. ఏచుందువేసియిక్కడ
కనతిదూరంబున కిష్కింధయను పట్టణముకలదు. దాని నింద్ర
పుత్రుడైనవాలి పాలించుచుండ నొక్కనాడు మాయావియను
రక్కసుండువచ్చి యాహవమునకు రమ్మనిబిల్వ మేమందరము
వాని నెదుర్కొంటిమి. వాడును సహింపలేక యొకకొండబిలం
బునజొచ్చె. నంతమాయన్న వాలిమమ్మందరగుహాముఖంబున
నుండుమని చెప్పి తానుగుహలోజొచ్చె. నదిమొదలాదరీముఖం
బుననుండి రక్తంబుపారజొచ్చె. నిట్లారుమాసములు గడచిపోవ
మాఅన్న మరణించెననితలంచి మరల వాడు కిష్కింధకువచ్చు
ననుభీతిచేబెద్ద పెనురాతినొకదానిని గుహాముఖమున కడ్డువైచి
వచ్చితిమి. పుర మరాజకమనియెంచి పెద్దలందరు కిష్కింధా
సామ్రాజ్యమునకు నన్ను రాజుగా నభిషేకించిరి. కొంత కాలము
నకు మాఅన్న కిష్కింధకువచ్చి కొండబిలమున కడ్డువైచితమని
యాగ్రహించి నన్నుజావగొట్టినాభార్యనుహరించెను. స్వామీ
మీరెట్లైన నావాలినిసంహరించి నాభార్యను నాకుజేర్పు
టకు బ్రార్థించెదను.

రాము—ఆహా సుగ్రీవ! ఎంతఆశ్చర్యము !

శా. ఆలిన్ గోల్పడి క్రూరరాక్షసునిచే హా యీశ్వరాయంచు దీ
నాలాపంబుల నీవు బోరిచెదవౌనా హా నన్నురక్షింతువౌ
జాలిన్ దూలితినంచు వెర్రినయి సంచారమ్మొనర్తు నే
నా! లావెప్పుడు వాలిరూపడది నీ యాలిన్ గరున్ గూర్చుటల్.

లక్ష్మ—అన్నయ్యా ! పత్నీవియోగముచే మతిచెడి స్వపరాముము
నెఱుంగక ఆశ్రితరక్షణ బిరుదాంకితమును మరచుచున్నావు.
యిపుడేగదా సుగ్రీవునితో నగ్నిసాక్షిగ సఖ్యంబు జేసితివి! నీవు
వాలిని దునుమాడుటెంత. సుగ్రీవునిభార్యను నీనికి జేర్పుటెంతపని.

రాము—అవునోయితమ్ముడా! యీతడవశ్యము రక్షనీయుడు కపి
శ్రేష్ఠ సుగ్రీవ భయపడకుము.

మ. ఘనగర్జారవ ముప్పతిల్లగ దెసల్ కంపింపగా జేసి భీ
షణకాలోగ్రనిశాతబాణముల వి శ్వంబెల్లభీతిల్ల వా
లినిసంహారము జేసి నీదు ప్రియురా లిన్ గూర్తునిక్కంబు నీ
వనుమానింపకుమయ్య కీశకులనా థా! నమ్ము మామాటకిన్.

(చేతిలో జేయివైచును.)

సుగ్రీ—స్వామి! మహాప్రసాదము. నాకింకనొక్క సందేహమున్నది.
యేమందురా?

చం. ఉదయ నగంబునుండి వడి నొక్కటనస్తనగంబు మీదికిన్
బదవడిదాటి కొండలను బట్టుచు బంతులపోల్కి నాడు దో
ర్మదమునవాలి వానిని దు రంబున గూల్తునెయంచు శంకనా
మొదజనించెనయ్య పృథి వీశ్వర! దుస్సహుడట్టివారికిన్.

రాము—సుగ్రీవా! అందులకై నీవు శంకింపవలదు,

సుగ్రీ—మహాత్మా! మిమ్ములనే బరీక్షించుచున్నానని తలంపవలదు.

ఉ. ఇందలి సప్తసాలముల ♦ నేకశరంబున గూలవైచియా
దుందుభి దేహముం గనఖము న్ తో వడిజిమ్మిన వాడవే వా
లిం దునుమాడ నేర్తు వవ ♦ లీలగ నట్టుల జేయుమయ్య నా
కొందలపాటు దీర్పు రఘు న్ కుంజర! నీకు నమస్కరించెదన్.

రాము—ఓహో సుగ్రీవా! అటులైన నాలాగే చేసెదను. జూడుము.

(బాణముచే సప్తసాలములగూల్చి కాలిగోటితో దుందుభిని జిమ్మివేయును. పెద్దచప్పుడగును)

సుగ్రీ—మహాపురుష! (నమస్కారముతో) యిపుడుకదా నిన్ను బరమేశ్వరుడవని తెలిసికొంటిని. ఆదుందుభి కళేబరము పదియామడలో బడినది.

మ. సకలద్వీపన గాటవీసహిత వి ♦ శ్వంబెల్ల నీచేతనే
యకలంకోజ్వలమై సృజింపబడె దే ♦ వా! నీవెయీభూమిభా
రకులన్ జంపి ధరిత్రసాధుజనులన్ ♦ రక్షింప జన్మించి దా
నుకృతంబుల్ ఫలియింప జేసితివి సు ♦ శ్లోకా! రఘూత్తంసమా.

హనుమం—దేవాదిదేవా! రామచంద్రపరబ్రహ్మ!

మ. మును లేవిశ్వమయుల్ జపించు మహా ♦ మోక్షంబులం బొంది ధా
త్రిని బాపలనుండి వీడుదురు తండ్రీ! ♦ అట్టి కళ్యాణ స
ద్గుణ ధాముండవు నీవ కావె! యనుర ♦ స్తోమంబు లెవ్వాని ర
క్షణచే సౌఖ్యము గాంతురట్టి జలజా ♦ క్షా! శ్రీపతి బ్రోచవే

(నమస్కరించును)

రాము—సుగ్రీవాంజనేయులార! మీభక్తికి మెచ్చితిని. మీకు భద్రంబులు చేకూరుగాక! మనమిక వాలినిద్రుంచుటకు బ్రయత్నింపవలయును. ముందుగ నీవుపోయి వాలినియుద్ధమునకుబిలచి సమరము సేయుచుండుము. నేనా కొవనుండి యొకకోలచే వాలిని గూల్చెదను. నీకునుంతయు భయము లేదు. రమ్ము పోవుదము.

సుగ్రీ—మహాప్రసాదము. తరువాత వెంటనే హనుమదాదుల బంపి సీతాదేవిని వెతకించెదను.

(అందరు నిష్క్రమించెదరు)

2 రంగము—కిష్కింధాపురోపకంఠసీమ

(యుద్ధసన్నద్ధులైన వాలిసుగ్రీవులును చెట్టుచాటున రామలక్ష్మణులును ప్రవేశించెదరు)

వాలి—ఓరీ! సుగ్రీవ! నేడు నీకింతమదంబు హెచ్చుటకు హేతువెయ్యదిరా!

ఉ. ఎవ్వరిసాయమున్ గలిగె ♦ నీయెడ మున్బలుసారులాజిలో
జివ్వదొలంగి పాఱితివి ♦ ఛీ! మరలన్ దలయెత్తి సిగ్గు లే
కెవ్విధి బోరునల్ప గను ♦ కించితి పౌరవిపుత్ర! రమ్ము నీ
క్రొవ్వునడంచి వైతు నిది ♦ ఘోషునముష్టిహతిన్ క్షణంబులో

సుగ్రీ—ఓరీమూర్ఖ! పరదారాపహరణపారాయణ! వాలి!

చం. అనుచితమైన పాపమని ♦ యాత్మదలంపక దుష్టబుద్ధి నా
వనితను దస్కరించి నను ♦ బాఱగదోలిన నీయఘంబె నా
కనిమొన సాయమౌచు బ్రబ ♦ లాగ్నివిధంబున నిన్ దహించురా
చెనటి! కృతాఘ్ను సంతతులు ♦ చేటును గూర్పక సౌఖ్యమిచ్చునే

వాలి—ఓరీ రవినందన! నీయాలినిగొన్న నాపాపము నీకు సాయపడదు కాని నీవలెభార్యను గోల్పోబడినవాడె నీకు సాయపడుటకు వచ్చియుండునని తలంచెదను. మంచిది యిప్పుడే నీబలమునకు నీసహాయపరుని బలంబును దృటిలో హరించెదనుగాక రమ్ము యుద్ధమునకు. (ఇద్దరు యుద్ధమును సేయుదురు సుగ్రీవుడు వెనుకకు పోవును)

వాలి—సుగ్రీవా! ఏమి అప్పుడే పారిపోవుచుంటివా!

సుగ్రీ—(రాముని జేరి) ఏమి రామా! వాలిదెబ్బలకు దాళలేక పోవుచుంటినికదా! ఏల యుపేక్ష సేయుచున్నావు.

రాము—సుగ్రీవా! మీయిరువురొక్క రూపువారగుటచే నిన్నే చంపుదునేమోయని భీతిచే నుపేక్షించితిని. క్షమింపుము నీవీగజపుష్పమాలను ఆనవాలుగ వేసికొనిపోయి మరల యుద్ధమును సేయుము (పూదండ సుగ్రీవుని మెడలో వేయును.)

సుగ్రీ—(పూదండతో బోయి) ఓరీ వాలి! యీసారి రమ్ము.

వాలి—సుగ్రీవా! యిపుడొక్క పూదండను దాల్చినంతనే ఘనుడవైతివా! రమ్ము. (ఇద్దరు యుద్ధము సేయుదురు)

రాము—(బాణముచే వాలిని గూల్చును)

వాలి—హా చచ్చితినిరా! (కూలి) ఓహో! ఎవ్వడవురా నీవు చెట్టుచాటుననుండి ఘోరశిలీముఖంబున గూల్చితివి

సుగ్రీ—(అన్నను జేరి) హా సహోదర! వాలి

ఉ. అంగనకై యుపేక్షపడి ♦ హా నినునీగతి గూల్చినాడ నీ
యంగము లెంత నొచ్చెనో మహా ♦ మహిమాన్విత తేజ నీదు దు
స్సంగతి యింత జేసె గలు ♦ షంబులు వ్యర్థములాగ బోవునే
యింగితముఁ దొఱంగునపు ♦ డెట్టి పరాక్రముడైన జావడే.

(తారా అంగదులు ప్రవేశించెదరు.)

తార—హా జీవితేశ్వర }
అంగ—హా తండ్రీ } (వాలిమీద బడుదురు.)

రాము—[సమీపించి] సాధ్వీమణీ! వానరపుత్ర! సద్గదులనంద దలచిన వారికై విలపింపరాదు. సకర్మమూలములై జీవు లీశరీర మాల బాయుచుందురు.

తార—అయ్యో! నీవెవ్వండవు?

లక్ష్మ—సాధ్వీ! మేము రఘువంశసంభూతులము. ఇతడు రాముండు నేను లక్ష్మణుడను.

అంగ—అయ్యలార! మీరిందేలవచ్చిరి.

లక్ష్మ—మాయన్నగారి భార్యను రాక్షసుఁడుగొంపోవ వెదకుచు నీలాగున వచ్చితిమి.

వాలి—హా ప్రియురాలా! ఆ రాముడే చెట్టుచాటుననుండి ఘోరశిలీముఖంబున నన్నుగూల్చినాడు. లేకున్నసుగ్రీవునకీపాటిబలమా

తార—హా జీవితేశ్వర!

చం. అనుజుడు సంగరంబునకుఁ గై నినుబిల్వగవాని కెవ్వఁడో
ఘనతర విక్రముండు సహాయకారిగ వచ్చెనటంచు విందు నో
యనఘుఁడ! పోవద్దని నయంబున జెప్పినద్రోసిపుచ్చి రా
ముని శరపంక్తి పాలబడి భూమిని ద్రెళ్ళితె ప్రాణనాయకా

వాలి—హా బాధ సహింపజాలను కదా!

అంగదు—హా తండ్రీ! అక్కటా యెంత బాధ పడుచుంటివో కదా

మ. జనకా! నీప్రియపుత్రు నంగదుని బిలిచి వత్సా రమ్ము నాముంగ నీ
మను కూర్చుండుము ముద్దులిమ్మనుచు బల్మారెంతో ప్రేమించి పె
ల్చిన మూర్ధంబును దావి నాతిమిచే లాలించు వారెవ్వరో
యనఘా క్రూరశరాగ్ని పాలయితి వయ్యా నాపది కేకడదక్క

తార—హా ప్రాణేశ్వర నీప్రియురాలిని నీయంగదకుమారునొక్కసారి కనువిచ్చిచూచి మంచిచెడ్డలు చెప్పవా

వాలి—(చూచి) ప్రియురాల తార వత్సా అంగదకుమార ఊరడిల్లుడు. నాకాలగతి యిట్లున్నది. రామ నీవు సకలలోకపూజ్యుండవని మునులుచెప్పగ వినియున్నాను. కాని కేవల మధర్మముగ జెట్టుచాటుననుండి అన్యునితో రణముసేయునప్పుడు నన్నుగూల్చి నీకీర్తిని దగులబెట్టికొన్నావుకదా.

ఉ. శూరుడవైన నాయెదుట ♦ నూటిగనిల్చి శితాస్త్రపంక్తిచే
బోరగవచ్చుగాని యొక ♦ భూజము చాటునునిల్చి దొంగవై
యే రవిసూనుతోడ నను ♦ రేచ్ఛ జరించెడువేళ ధర్మముం
మీరి శరంబుచేత నను ♦ మేదిని గూల్చుట నీకు శ్రేయమే
రాము — వాలి! నన్నేలనిందించెదవు నీవు ధర్మేతరంబుగ దమ్ముని భార్యను స్వీకరించిన దుష్టమృగంబవు. మృగయుడు క్రూరజంతువులనూటొగ్గి చాటుననుండి చంపునటులే నేనును ధర్మరక్షణమునకై నిన్నిట్లు కూల్చితి నిందువలన నాకుదోషంబులేదు.
వాలి — శ్రీరామ! అవతారపురుషుడవైయును నీవిట్లుసేయుట ధర్మము కాదు సుమి!

చ. అవినయబుద్ధి నీదుప్రియు ♦ రాలిని మృచ్ఛిలినట్టి దుష్టశా
త్రవుడగు బంక్తికంధరుఁ బ ♦ దంబులు బాహువులనంటగట్టి మా
నవకులనాథ! నీకుచర ♦ ణంబుల సన్నిధి బెట్టకుందు నే
పువులు ఫలంబులంగలుగు ♦ భూజము బొగ్గులకై దహించితే
రాము — వాలీ! నీవుదుశ్చరిత్రుడవై యనుజుని భార్యను హరించినవాడవు. నీవలె దుశ్చరిత్రుడై నాభార్యను హరించిన రావణుని దునిమి నాకు మేలుసేతువా! చేసెదనన్న సమ్మతింతునా మరియు నిన్నేలచంపితినన,

చ. అనుజునిపత్నియైన రుమ ♦ నాలిగ జేకొని వానిబాఱదో
లిన ఋజుమార్గవర్తివి వలీముఖ ♦ దుష్టమృగంబ వీవు ని
న్ననయము జంపకుండిన ధ ♦ రాధిపుడౌ నను జేరు నీవుచే
సిన యఘమెల్లగాన నిటు ♦ చేసితి నన్నిక నిందమానుమా.
వాలి — రామచంద్ర! నిన్నగనేల నాపురాకృత దుష్కర్మయే నన్నింత చేసినది. నీవుచేసిన మహత్కార్యమువలన నీవు నిఖిలేశ్వరుడవని వినియున్నాను. నీసందర్శనమున బవిత్రుడనైతిని. నీచే

జావు నాకు సపవర్గ సుఖమీయుగల్గును. నాకీయవస్థ గలిగినందుకు విచారించుటలేదు. కిష్కింధారాజ్యము సుగ్రీవునిచే నేలించినను నాయంగదకుమారునకు యౌవరాజ్యపట్టాభిషేకము జేసి నీపుత్రునట్లు రక్షించుము. నేనీఘోరశిలీముఖ బాధ భరింపజాల వేగదీనిని వెలికి నాకు సద్గతులీయుము నీకివేవందనములు.

రాము — వాలి ! నీకుమారుని నీవుచెప్పినట్టులే కరుణించెదను.

తార — హా ప్రాణేశ్వర !

చ. సతులకు ప్రాణనాయకుడె ♦ సర్వసుఖంబులు జీవితంబు దు
గ్గతిబడి నీవుపోవగ జ ♦ గంబులతో బనియేలనాకు నా
హృత వరపుష్కలల న్బడియె ♦ యుగ్రమహోదధి గూలియో ణమను
ప్రతతిని బాసి నీదుపద ♦ పద్మములన్ భజియింప వచ్చెదన్

వాలి — దేవీ నీవట్లనకుము నాకుసద్గతియె లభింపనున్నదని తలంచుము. హా అంగదకుమార ! నీవుశోకింపక యీరామచంద్రు నారాధించుచుండుము.

అంగ — హా జనకా ! నిన్నువిడచి యెట్లు సహింతునయ్యా !

చ. ధరణితలంబు కుంగిన వి ♦ ధంబున నింగియు బ్రద్దలౌచు నా
శిరమున గూలినట్లు లయ ♦ సింధువులొక్కట ముంచురీతి దు
ర్భరతర దుఃఖమున్బొదివె ! ♦ రాముని ఘోరశిలీముఖంబుచే
దొరగిన నిన్నుజూడగనె ♦ దుఃఖముబొందక యెట్లుసైచెదన్

వాలి — క్రూరా! యికవిచారింపకుము దేవీ! మీకిక రాముడే శరణ్యుడు రామా ! నేనికసహింపజాల, వేగశరము నన్నాలింపుము.

రాము — అటులేచేసెద. నీకు బుణ్యలోకములు వచ్చుగాక ! (బాణమును దీయును)

వాలి — హా రామ హా రామ ! (ప్రాణములవిడచును.)

తార—హా ప్రాణేశ్వర ! హాలోకైకవిక్రమ !

మ. నను నీయంగదపుత్త్రుని న్విడచి నా ♦ న్యంబైన స్వర్గమ్ము నం
దనయంబుగ సుఖమందఁబోయితివె ! నా ♦ థా యింనాక కేలయీ
తనువు న్చితిలోన వ్రేలిచి భవ ♦ త్పాదంబులన్ గొల్వగా
జను దెంతున్ బతిలేని నాబ్రతుకు వి ♦ శ్వంబందునన్ భారమా
హా జీవితేశ్వరా ! నీకుమృతియె కల్గదని యెంతముఱిసితినో అంత
నిష్ఫలమయ్యెగదా !

అంగ—హా సుతవత్సలా !

గీ. తండ్రి ! నీవ స్తమించుట ♦ ధాత్రి యెల్ల
నంధకారమ్ము క్రమ్మె నా ♦ యాత్మ ... న్య
మయ్యె రెక్కలులేని వి ♦ హంగమట్లు
తీవ్రశోకాగ్ని పాల్పడితి ♦ ని కదయ్య.

రాము—వత్సా! అంగదకుమార! ఊరడిల్లుము. మరణ మేరికినిదప్పదు

అంగ—అహా రామచంద్ర ! ఎంతవాడవయ్యా !

గీ. జనకునివధించి యేడ్చెదు ♦ తనయు జూచి
యూరడిలుమంచు బల్క నీ ♦ కుచిత మగు నె
సర్వలోక శరణ్య ల ♦ క్షణము లిట్లు
లలరు నే రామచంద్ర మ ♦ హాను భావ!

రాము—అంగదా! జీవులు స్వకర్మచేత నే కష్టసుఖముల ఫలమునునుభ
వించెదరు. తత్కర్మలే జననమరణములకు గారణములు కాని
యొకరి నొకరు చంపువారులేరు. రక్షించువారులేరు. కర్మకా
రకులు నిమిత్తమాత్రులు కావున నీవు చింతింపకుము. నీజనకు
నకు బుణ్యలోకముల నొసంగినాను.

తార—రామమూర్తి! పుణ్యలోకమో పాపలోకమో భవిష్యత్తు
నెవ్వరు నిర్ణయింపగలరు. నీవుపరమేశ్వరుడవని గర్వపడుచున్నా

వేమో నీవును శరీరధారివే. మావలె నీవును సుఖదుఃఖముల ననుభవించువాడవే. నీవుభగవంతుడవని మునులు బొగడ గర్వించి నాకేమియుని నానాథు నధర్మమున జంపినావు యీకలుషము నిన్ను జహింపకపోదు. నీవు భగవంతుడ నైనను నానాథుడు నాకు భగవంతుడు. అట్టివాడే యీలోక మును బాసిపోయిన నాకీలోకముతో బనియేల. వేరుభగవం తునితో బనియేల నాపతినిజంపుట నీకు దోషములేదంటివి. ఆమహాపాపము నిన్నేల జుట్టుకొనదోచూచెదనుగాక. నాశాప ఫలమిదేయనుభవించుము నేనే నిజమైన నీకప్రతివ్రతనైతినేని

ఉ. ఆలినిగోలుపోయిన మహావ్యథచే ♦ దపియించుచుండియున్
శీలములేకదొంగవలె ♦ జెట్టునకావలబొంచి నాపతిన్
గూలిచి యాలిసౌఖ్యమునకున్ ♦ వెలిజేసితివీవు కాన నీ
యాలినిజెంది సత్వరమ యాలిని ♦ బాసినవంత నొందుమా

రాము—తారాసాధ్వీ! నీశాపమువలన నీపట్టున నాభార్యను నేనుబొం దగలనని సూచింపబడినది. తరువాత వియోగదశవచ్చుగాక రాక పోవుగాక. ప్రస్తుతము నాసతిని బొందిన నాకదియే పదివేలు.

తార—హా మహానుభావ! రామచంద్ర! దుర్భరమైన వైధవ్యదశననుభవింపజాలక క్రోధావేశంబున నిన్నుశపించితిని. నాయపరాధమును మన్నింపుము.

రాము—అమ్మాయీ తార! నాథవిష్వక్త్కృష్ణననుసరించియే నీనోట నుండి యీమాటవచ్చియుండును. అందులకై నాకుజింతలేదు. రమ్ము పోవుదము. నీభర్తకగ్నిసంస్కారము సేయవలయును. గదా!

తార—చిత్తము. (అందరు నిష్క్రమించెదరు.)

---



శ్రీ

# సంపూర్ణ రామాయణ నాటకము.

## నవమాంకము.

### 1 రంగము—మహేంద్రగిరి.

(జాంబవంతాంగద హనుమంతులు ప్రవేశించెదరు.)

జాంబ—హనుమంతా! బుద్ధివంత!

గీ. ఆవిధంబుగ సంపాతి • యను ఖగపతి
శంక లేకుండ యాసీత • లంకలోన
నున్నదంచును జెప్పెనీ • పూరకుంట
దగునె వేవేగ నీవార్ధి • దాటవలయు.

మఱియు నీమహోదధి నుత్తరింప నీవుకాక మాలో సమర్థులు లేరు. యిందులకీవే యర్హుడవు నిన్నీ కార్యసాఫల్యము జేయుటకు బట్టభద్రుని జేసితి నీకు జయము గుగాక! (పుష్పహారమును వేయును.)

హనుమం—జాంబవంతా! నీవు పూజ్యుడవు. నీమాటప్రకార మట్లే చేసెదను.

సీ. కుప్పించి యెగసిన • కులగిరుల్ క్రుంగి పా
తాళకచ్ఛప • పతితల్లడిల్ల
వాల విక్షేపసం • భవమారుతంబున
నంబరచరులెల్ల • రడవిసార
గమనవేగంబునను మహీరుహ • హములెల్ల
విరిగిమిన్నంటినా • వెంటనడువ

నావైనకర్ణకుండలరత్నములపోల్కి
నిన శశిబింబంబుల్ గుదిసియాడ
గీ. నాకసమునకెగసి మహాద్భుతముగా
నమృతముం దెచ్చు ఖగపతియట్లు నేను
జలనిధిని దాటి లంకవిశ్శంకజొచ్చి
జానకిని గాంచివచ్చెద క్షణములోన.

జాంబ — తథాఅస్తు! నీకు నీజనకుడైన వాయుభట్టారకుండు సహాయపడుగాక.

హను — మంచిది. నేనీశిఖరమెక్కి యిచటనుండి లంఘించెదను (నిష్క్రమించెదరు.)

2 రంగము — లంకాముఖద్వారము.

(లంకయను నిశాటిని హనుమంతుడు ప్రవేశించెదరు)

లంక — ఔరా! ఈకోతిగాడెవ్వడో నిశ్శంకముగా వారాశిదాటివచ్చెనే! ఓరీ! వానరాధమ! ఓరీనీచమృగమ! యీదేవతాభయంకరమైన రావణ సార్వభౌముని లంకాపురమును నేను రక్షించు లంకయను నిశాటిని. నేనిందుండ నీవెందుబోయెదవు. యెవ్వడవురా నీవు

హనుమం — ఓసీ నిశాటీ! నేనీపురమునుజూచి పోవచ్చితిని. (పోబోవును.)

లంక — ఔరా! కోతిగా ఆగు మాగు మెందుబోయెదవు. (పోటు పొడుచును.)

హను — ఓసీ రాకాసీ చచ్చితివే (గుద్దును లంకకూలును.)

లంక — ఓహో వానరనాయక నీవెవండవో తెలిసికొంటిని. నీవు రామచంద్రుని భార్యయైన సీతాదేవిని వెతుకవచ్చినహనుమంతుడవు

కావా! తొల్లి బ్రహ్మ జానకికొరకై వచ్చిన హనుమంతుండు నిన్నెప్పుడు క్రూల్చునో అప్పుడు నాకు శాపవిమోచనమనియు నీలంకయును సబాంధవుడగు రావణుడును హరింపబడుననియాన తిచ్చెను. అనుజుడు చెప్పినట్లె జరిగినది. నీకార్యము సఫలము గును నేనిక పోయెద నాకు శెలవిమ్ము. నాశాపమును బాపిన నీకిదే వందనశతంబులు. (నిష్క్రమించును)

హను—మంచిది. నీవు పొమ్ము. ఆహా యీలంక నాచేజచ్చి శాపవిము క్తినిగాంచి లంకాపుర భావిఫలము జెప్పుటచే నాకు మంచిశ కునమైనదని తలంచెద జనక దేవిని వెతుకబోయెదను.

(నిష్క్రమించును.)

---

3 రంగము—అశోకవనము

(సీత, త్రిజట, సూర్పణఖి ప్రవేశించెదరు.)

సీత—హా రామచంద్ర!

సీ. నను పర్ణశాలలో గనలేక ♦ హృదయంబు
వీ్రల బ్రాణంబుల వి ♦ డచినావా
అడవుల గుహలందు ♦ రచి న్గానక
యుడవిగంగనుగూలి ♦ మడసినావొ
సీతలేనట్టి నా ♦ జీవమేలని కొండ
కొననుండి యిలజావ ♦ గూలినావొ
అక్కటా! జానకీ ♦ యనుచు హాహోయి కృ
పాణంబుచే నసుల్ ♦ బాసినావొ

గీ. లేక యుండినన్ను నీ ♦ లీల నిన్ని
నాళ్ళు విడనాడియుంటివే ♦ నాథనీవు

సర్వలోకశరణ్యా! నీ ♦ సతికె యిట్టి
యిక్కటులు మూడ నితరులు ♦ లెక్కయేమి
హా రఘుకుల దీపక రామచంద్రా!

హనుమంతుడు—(ప్రవేశించి తనలో) అన్నన్నా! యీలంకాపురమున నెందు వెతకినను మాతల్లి జానకీదేవిజాడ నుంతయుగనరాలేదు ఇక నా కార్యమెట్లు సాగునో తెలియదు. అయిన నీయశోక వనమునుగూడ వెతకెదను. (వచచి చూచి ఆశ్చర్యముతో) ఓహో యీవృక్షమూలమున నవతరించిన శోక దేవతవలెరాక్షస స్త్రీ పరివృతయై కూరుచున్నస్త్రీ సీతాదేవికాదుకద! ఆ అన్నన్నా! యెట్టి దురవస్థ ఘటిల్లినది.

గీ. ధూళిబొరసిన లేత ♦ వలీల, ధూమ
చయముగప్పిన శిఖికీల ♦ సరణి నకట
యీనిశాటులమధ్య ♦ మహాకుమారి
యెట్లు దుఃఖార్తయై కృశి ♦ యించెనొక్క

నిక్కముగ నీమె నైజ దేహ గుణములు సుగ్రీవుడు చెప్పిన

ఉ. చెక్కిలి పాణిపద్మమున ♦ జేర్చి యుష్ణవేడి మాని పెర్వ
సొక్కగ నశ్రుబిందువులు ♦ శోకమునంగపరాల్ప చెన్నగుల్
చిక్కువడంగ బెన్జడ ♦ చే వలరారెడు నీమె సీతయె
నిక్కము శోక దేవత జ ♦ నించిన యట్టులదోచె నక్కటా

(తెరలో) ఓసీ ధూమ్రాక్షి! శీతసన్నిధికి మన రావణ సార్వభౌముడు వచ్చుచున్నాడని తెలుపుము.

హను—ఓహో! దేవితో ప్రసంగింపకుండ నేనువీరికన్నుల బడరాదు వీడుపోవువరకును సూక్ష్మాకారముతో నీయశోక పాదమెక్కి చెట్లయాకులలో నడగియుండెదను (అట్లు చేయును)

చేటులు—(లోల్కొంతురు.)

రావణుడు.—(ప్రవేశించుచు) ఓసీ ధూమ్రాక్షి! నాయర్థాంగియగుటకు సీత సమ్మతించెనా లేదా?

ధూమ్రా.—స్వామి! మేమెంత చెప్పినను మామాట వినకున్నది.

రావ.—సరే మంచిది. నేనే చెప్పెదను ఏమే సీతా!

మ. నుగసామ్రాజ్యపదంబు నాకరమునన్ ♦ శోభిల్లుచుండెంజుమీ
తరుణీ! నాకెదురాడిపోరు ఘనుడీ ♦ ధాత్రిస్థలిన్ లేడు నీ
వరుడా రాముడు నాడె చచ్చెనని నీ ♦ స్వాంతంబునం దెంచుమా
లెఱువంబోకుము నన్ను జేకొనుము రావె ♦ గాగలీవె సతీ

సీత.—ఛీ! దురాత్మా! ఏమిరా! పేలెదవు.

ఉ. ఓరి నిశాచరాధముడ! యోరిమిపట్టుము కొన్నినాళ్ళు నీ
సారము బీరముం గులము ♦ జయ్యన శ్రీరఘురామ విక్రమో
దార శిలీముఖాగ్నులకు ♦ దగ్ధము జెందిన యప్పుడుక్తకాం
తా రతిసౌఖ్యమందెదవు ♦ తప్పక మోహముదీరు నీకటం

రావణ.—ఓ జానకీ! యింకను రాముడీ లంకకు వచ్చునని యే తలంచుచున్నావా! వెఱ్ఱిదానా! ప్రాణసమానురాలవైన నిన్నుగన జాలక రోసిరోసి విసిగి వేసరి యీపాటికే యాతడు మడసియుండును. ఒకవేళ మొండియై బ్రతికినేని

ఉ. ఈశతయోజనాయతము ♦ నీయుసమాన గంభీరమైన వా
రాశిని దాటి యీపురికి ♦ రాముడు వచ్చుటకల్ల భర్తపై
నాశదొలంగుమింక ముద ♦ మారగ నన్నుబరిగ్రహించి యీ
యాశరరాజ్య లక్ష్మివయి ♦ యందుమనంత సుఖంబులం జెలీ.

సీత.—ఛీఛీ! పాపము శమించుగాక ఓరీ నిశాటాధమ! ఆరామచంద్రుండీవారాశిని దాటిరాలేడని పలుకుచున్నావు కాబోలు నట్లు తలంపకుము.

చం. అసురపదార్థమై జనన ♦ మందెను ధారుణి రాముడంచు నల్
దెసలను మ్రోగుచుండ జల ♦ ధిన్ దరియించుట లెంత మిమ్ముల్
వెస దునుమాడు టెంత రఘు ♦ వీరుని మాటయటుండ నీదు దు
ర్వ్యసనమె నిన్ను జంపు దులు ♦ వా! స్వకృతాఘము రిత్త పోవునే ♦

రావ—సీతా! నీవు వట్టిబేలవు ప్రళయాగ్నిని సామాన్యాంచని తలంచు చున్నావునుమీ. నాపరాక్రమము నీ వెఱుంగవు.

ఉ రావణు విక్రమంబునకు ♦ రాముడె కాడు త్రిమూర్తు లొక్కటై
దేవగణంబుతోడ నగు ♦ దెంచినగాని మదీయ లోక వి
ద్రావణ ఘోర బాణశిఖ ♦ దగ్ధము జెందక నిల్వరంచు నే
నీవిధి గంకణంబు ధరి ♦ యించితినమ్మి తలోదరీమణీ.

(చెట్టుమీద హనుమంతుడు) నీతిలలు భూమిమీద రాల్చుటకు నా రామచంద్రుడు కంకణము గట్టుకొని యున్నాడురా! మదాంధ!

రావ—ఆ యెవ్వడవురా! నీవు (అటునిటుజూచి) ఓహో యిదంతయు నామతిభ్రమణము లేకున్న నీవారాశిదాటి వచ్చువాడెవ్వడు సరే! సీతా! యిప్పు డేమిచెప్పెదవు?

సీత—ఓరీ తృణప్రాయుడ!

ఉ. కుత్తుక గోసి రక్తమును ♦ గ్రోలిన గ్రోలగవచ్చుగాని మై
గత్తులగోయుగాక చెడు ♦ గా! నిను జేరుట కల్ల నీకు సం
పత్తులు మాయు నీవదన ♦ పంక్తులు ధాత్రిని రాలు రక్కసుల్
చత్తురు నిశ్చయంబిదియె ♦ శాపమొసంగితి రావణాధమా!

రావ—[తనలో] ఈమెను బలాత్కారముగ గొంపోవుదునుగాని బలవంతముగ స్త్రీని స్పృశించెద జచ్చిపోవుదునని తొల్లి నాకొక శాపమీయబడినది. అందుచే గ్రామముగ నఖులచే సమ్మతిపరపించెదనుగాక ఓసీ ధూమాక్షి! ఈమెకు నయభయముల

బుద్ధి చెప్పి క్రమముగ నన్నేలుకొనునట్లుచేయుడు నేనుపోయె
దను. (నిష్క్రమించును.)

ధూమ్రా—ఏమేసీతా! నీకింకను దిక్కు తిరుగ లేదా! ఎక్కడిరాముడు
యెక్కడిలక్ష్మణుడు వారలువచ్చుటెక్కడ వారాశి దాటుటె
క్కడ అదియంతయు గల్లమాట. మా రావణబ్రహ్మను చేపట్టి
తివేని యాపుష్పకయానము లేమి యాపచ్చల భవనము లేమి
యాపుష్పశయ్య లేమియాపరిమళద్రవ్యము లేమి యాదివ్యభోజ్య
ము లేమి ఆ కేళీసుఖ సామ్రాజ్యమేమి అహా నీవొక్క సారి
రుచిచూచిన మరల విడువగలవా! కాంతలకు గావలసినది
కామసుఖమేగదా! నామాటవిని రావణబ్రహ్మను చేపట్టుము.

సీత—అమ్మా నన్నుజంపినను సరియేకాని నేనట్టి యమంగళకార్యము
నకు సమ్మతించుదాననుకాను.

ధూమ్ర—అటులైన నిన్నిపుడే మ్రింగివేసెదను. (అలలలా ఆ, (మ్రిం
గబోవును)

త్రిజట—ఓసీ ధూమ్రాక్షీ! తాళుము తాళుము. ఆమె నెవ్వతియని
తలంచుచున్నావు. రాక్షసకులమునకు మృత్యువునుమి.

ధూమ్రా—పోనిమ్మా నాకేల. నేనావలకుబోయి నిద్రించెదను.
(నిష్క్రమించును)

సీత—అమ్మా! త్రిజట! కష్టసముద్రమున మునింగియున్న నాకు నీవు
రక్షకురాలవు నీయోగ్యత. మెచ్చదగినది. నీకు భద్రంబులు
కలుగుగాక.

త్రిజట—అమ్మా నీవు విచారింపకుము. నీమగండు రాముడు తెల్లని
యేనుగనుబూన్చినపుష్పకము నెక్కి రక్తముద్రావుచు మిన్నం
టిలోకంబుల మ్రింగినట్లు కలగంటినికతప్పక రామచంద్రుడు
వచ్చి నిన్నుద్ధరించును. ఈకష్టమచిరకాలములో దొలంగును.
నీవు సంశయింపకుము.

సీత—తల్లీ! త్రిజటా! ఎంతటిపుణ్యాత్మురాలవమ్మ!

ఉ అమ్మ విభీషణాత్మజ ♦ శుభాంగిరో! కష్టమహాబ్ధినున్ని దుః
ఖమ్మునుబొందునట్టి గని ♦ కారణమేమో గనుచున్నదానవౌ
యన్న మనీయభర్తగను ♦ గారగగాంచితె స్వప్నమందు, శ్రే
యమ్ము లభించునీకు నుగు ♦ ణాన్వితవాటను నమ్ము నామదిన్.

ఓ ఆత్మసమురాల! ఆనుహానుభావుని యాకారలక్షణము లేమైన జెప్పగలవా!

త్రిజ—అమ్మా! నీనాథుండిందనీల మాణిక్యకాంతులీను మేనిలావణ్యమువాడు, కలదళాయతాక్షుడు మరియునెన్నో శుభలక్షణములగలవాడు. తప్పక నీనాథుడే సందియములేదు నిన్నుధరించితీరును. నాకుమిక్కుటముగ నిద్రవచ్చుచున్నది నీవును గొంచెముసేపు నిద్రించుము నేనుపోయెదను.

(నిష్క్రమించును)

హను—(చెట్టుదిగివచ్చి) ఈరాక్షసాంగనలు గాఢనిద్రకు బ్రారంభించినారు. నేను సీతామహాదేవితో మాట్లాడుటకు మంచిసమయము తటస్థమైనది, (సమీపించి) తల్లీ! జానకీదేవి! రామచంద్రునిదూత హనుమంతుండిదే నమస్కరించుచున్నాడు.

సీత—(భయముతోజూచి) ఓసీ మాయావానరరూపధారి! రావణ!

చ. ఎఱుగుదు నిన్ను రావణుడ * వీవనికై తవ వానరాకృతిన్
బఱుగుచు రామచంద్రునకు * బంటునటంచు వచించినంతనే
స్థిరమతి నిన్నునమ్మెదునె * ఛీ దనుజాధమ! పొమ్ము శాంబరీ
కిరణ సమర్థ లీభువన * కంటకులంచు నెఱుంగకుంటినే

హను—రామరామ! తల్లీ నైజేహి!

ఉ. నమ్మునుతల్లి! నేనురఘు ♦ నాథునిదూతను నిన్నునాతుర
ణ్యమ్ములరోసి కానక మ ♦ హత్తర దుఃఖముచేత ఋష్యమూ

కమ్మనుజేసి మూర్ఖవ ♦ కాంతునితో దగుమైత్రి జేసి శీ
ఘ్రమ్ముగ నీదుజాడగని ♦ రమ్యపవార్ధిని దాటివచ్చితిన్.
సీత—ఓయీ! అంతమాత్రమ్మున నీవు నానాథుని దూతవని నమ్మ
జాలను.
హను—తల్లీ! అటులైన వేరే చెప్పనేల!
మ. ఇదె శ్రీరాముని యాంగుళీయకము త ♦ ల్లీ! దీనివీక్షింప నీ
మదిలో శంకదొలంగి నన్నికను న ♦ మ్మం జాలుదీవమ్మ! నీ
పద దాసుండను నీకుమారకుఁడను నీ ♦ బన్నంబులున్ దీరునీ
యెదనుఃఖంబును వీఁకరాముఁ డసురల ♦ హింసించి నిన్గాచెడున్.
(ఉంగరము సీతకిచ్చును.)
సీత—(చేకొని కన్నులనద్దుకొని) హా! శ్రీరామనామాంగుళీయకమా!
చ. పతినెడబాసి రావణుని ♦ బారికిజిక్కి కృశించుచున్నదో
వెతలనుఁ గున్గి ప్రాణముల ♦ వీడునొ యేమొయటంచు రామభూ
పతికర కంజసౌఖ్యమును ♦ బాసినదాన్ గనవచ్చినావె! హా
హితులనుబ్రోచునో స్వసుఖ ♦ మొందదుగా భువి నంగుళీయమా.
హనుమంతా! నిన్నిప్పుడు నా ప్రాణేశుని దూతనుగా నెఱింగితిని.
నానాథుండు నన్నుద్ధరింతునని నిశ్చయముగ జెప్పినాడా! నామదిలమ్మ
ఱుకు నా మాటదలంచెనా! ఎప్పుడువచ్చెదనన్నవాఁడో నిజము చెప్పి
పుణ్యముఁ గట్టుకొనుమా.
హను—తల్లీ! నిన్ను బాసిన యామహాత్ముల పరితాపమేమని చెప్ప
దును. ఆ రామభూవల్లభుండు,
ఉ. హాయని వేడియూర్పుల బ్రి ♦ యా యను హా జనకాత్మజాత, సీ
తాయను దైత్యపాలుచెతె హా ♦ యకు కష్టములొందుచుంటి వ
య్యో యనుప్రాణముల్విడక ♦ యుంటివె! హాయని యెక్కి భూమిపై
కాయముగూల్చి మైమరచు ♦ గాదె ప్రతిక్షణమున్ దల్లిరో.

సీత—హా ప్రాణేశ్వర! నావలన మీ కెంతటికష్టములు వాటిల్లివప్రోక దా !

హను—అమ్మా! ఆలక్ష్మణస్వామి ఘోష చెప్పనలవియే కాదు.

ఉ. ఎన్నగరాని దుఃఖమున * నేడ్చుచుమూర్ఛిలిలేచియమ్మ ! యా
చెన్నటిరాక్షసాధముల * చేబడి యొంతతపించుచుంటివో
బన్నములందలేకనిజ * ప్రాణము బాసితివేమొతల్లియం
చెన్నొవిధాల నశ్రువుల * దేవనిగా నొలికించుగన్నులన్.

సీత—హా భ్రాతృవత్సల ! లక్ష్మణ ! నేనెంత పాపాత్మురాలనోయి

చ. అనుపమ సద్గుణాంచితుఁడ ‡ వైన నినున్ బరుషోక్తులాడియా
యనఘుని రామచంద్రుని ప ‡ దాబ్జములన్ నినుబాసియక్కటా
దనుజులచేతజిక్కినిర ‡ తంబు మహత్తర దుఃఖవార్ధిలో
మునిగితి నట్టిపాపము ‡ భూతమె యయ్యెను నాకులక్ష్మణా.

అక్కటా ! హనుమన్నా ! ఆరామచంద్రుఁడు రావణుని సంహరించి నన్నెన్నఁడు గొంపోవునోకదా ! అంతవరకు నేను బ్రతికియుందునా !

హను—తల్లీ ! చింతిల్లకుము.

ఉ. నిక్కము రామచంద్ర ధర ♦ ణీపతి వానరసేనతోడఁదా
నిక్కడకల్లిన్ దరించివడి ♦ నీపురిఁజేరి విరోధులైన యీ
రక్కసులన్ వధించి నిను ♦ రాతితకీర్తి బరిగ్రహించు బెం
పెక్కసుఖంబులన్ బడయు ♦ దీవు విచారము మాను మమ్మరో.

సీత—వత్సా ! హనుమంత ! నీవునిక్కముగ నానాథునకు దూతవు కావు యేమందువా ! నాప్రాణేశ్వరుండువచ్చి రక్షించునో లేదోయని నావేణీబంధ మురిప్రోసికొని ప్రాణపరిత్యాగము సేయనున్న నాకుఁబ్రత్యక్షమై ప్రాణదానం బొసంగితివి నీవు నాకు దైవమవు, రక్షకుఁడవు, పుత్రుఁడవు, హితుఁడవు. కావున నీకు నమస్కారములు, స్వాగతములు, ఆశీర్వచనములు, నానాథుని వేగ దోడితెచ్చి నన్ను రక్షించుభారము నీది.

హను — తల్లీ! తక్షణమే మాప్రభువుని తోడితెచ్చెదను అట్లుకాక

ఉ. ఇప్పుడె నిన్ను వీపుబయి నెక్కగ జేసి మహాబ్ధిదాటి రా
ముప్పకు జేర్పగా దగుదు నైనను రాముని కీర్తి కెంతయున్
దప్పు ఘటిల్లు నంచును త థావిధి సేయగ నొప్ప కుంటినీ
వెప్పటి యట్లు నుండు మిట నే త్వరరాముడె వచ్చి చేకొనున్.

కావున గొలదికాల మోపిక పట్టి యుండుము.

సీత — నాయనా! చక్కని మాటజెప్పితివోయి. కష్టములకోర్చియట్లే యుండెద. మఱియు నా నాధునితో నిట్లు చెప్పుము.

చ. నిలుపగజాల బ్రాణముల నీపదపద్మములన్ దొఱంగి, యీ
తులువల రాక్షసాధముల దుర్భరవాక్యశరవహ్ని నానుదిన్
మలమల మాడ్చుచో చ్చెనిక మానము ప్రాణము నెట్లుగాచెదో
యలఘుపరాక్రమైకనిధి! హా హృదయేశ్వర! యంచుజెప్పుమా.

హనుమన్నా! యీచూడామణిని గొంపోయి నానాధున కర్పించుము.
(చూడామణి నిచ్చును.)

హను — తల్లీ! అటులే చెప్పి వేగదీసుకొని వచ్చెదను క్షుద్బాధకు సహింప లేకున్నవాడ నాకీవనమునందలి ఫలములను గోసి కొనుట కనుజ్ఞనిమ్ము.

సీత — అట్లే కోసికొని భక్షించుము. కాని అసహాయశూరులైన రాక్షసులు రక్షకులై యున్నవారు. బహుభద్రముసుమి!

హను — అమ్మా భయము లేదు. నేనుపోయి వచ్చెదను.

సీత — మంచిది నీకు మార్గమున భద్రము కలుగుగాక!

హను — (తనలో) నేనువచ్చి యూరకపోరాదు. ఈవనమును ధ్వంసము జేసి రావణునకు బుద్ధిచెప్పి పోయెదనుగాక (విధ్వంసించును

4 రంగము—అశోకవనము.

(హనుమంతుడు వనమును బాడుచేయుచు బ్రవేశించును.)

రాక్షసుడు—(ప్రవేశించి) ఓరోరి వానరాధమ ! యెవ్వడవురా నీవు? మావనమెల్ల బాడుచేయుచుంటివే చచ్చితివిరా (కొట్టును.)

హను—ఓరీనిర్భాగ్యుడ ! నీయబ్బతో జెప్పికొనుము. (చావగొట్టును)

రాక్షసు—ఓరబ్బో ! యిదికోతికాదురా ! వీనిసంగతిమా రావణునితో జెప్పిచంపించెదగాక. (నిష్క్రమించును.)

హను—సరే వచ్చినవారినెల్ల జావగొట్టినదుదకు రావణుడే రాగలడు వానికి నాశక్తినిజూపి పోయెదనుగాక.

అక్షయకుమారుడు—(ప్రవేశించును.)

గీ. ఎవ్వడవురోరి వానర ♦ క్రొవ్వుబట్టి
యీవనము బాడుచేయు చు ♦ న్నావు నీవు
ప్రథిత విక్రమరావణ ♦ బహ్మ్మకిలుక
బాడమనిలుతువె నీవును ♦ భువనచయము.

హను—ఓరీమూర్ఖ !

గీ. రావణబ్రహ్మ మగడను ♦ రాతికోట
నేనుకోపించినంతనే ♦ నిఖిలభువన
చయముగడగడవడకు భా ♦ స్కరముఖగ్ర
హంబులల్లాడి యిలరాలు ♦ నద్భులింకు.

నేను దానవుల పాలిటిమృత్యు దేవతనుసుమి. కాచికొమ్ము

అక్ష—ఓరీ వానరాధమ! అట్టులైన రావణాత్మజుడైన అక్షయకుమారుని హేతిఘాతకు బలియగుము. (కొట్టును)

హను—ఓరీ! అధమాక్షకుమార ! వచ్చితివిరా ! (చంపును.)

రాక్ష—ఓరీ ! బాబో మాఅక్షకుమారుని చావుకబురు చల్లగా మా రావణబ్రహ్మతో జెప్పెదను (పారిపోవును)

ఇంద్రజిత్తు—(ప్రవేశించును.) ఓరీ! వానరాధమ!

ఉ. చూపులకింత లేవు పురి ♦ జొచ్చితి వేక్రియ నిజలార్ణవం
బేపగిదిం దరించివధి ♦ యించితి వీడశకంపు పుత్రు నీ
కైపలురక్కసుల్ మడిసె ♦ నాకలి కగ్గిన బండ్లమెక్క నో
నేపని లేక యీవనము ♦ నీక్రియధ్వంసము సేయజెల్లునే.

హను—ఓరీ! నీవేనా? యింద్రజేతవు. వినుము చెప్పెదను.

చ. సకలజగంబులకా మదికి ♦ సంతసమిచ్చెడు బండ్ల నెందుగా
నక జలరాశినొక్కచర ♦ ణంబుగ దాటి పురిం జరించి యెం
దుకుగొంగాని భుజమ్ముల ♦ దున్ముచు బాహొనరింప నందుకో
ర్వక యెదురాను వారితల ♦ పండ్లను మెక్కుచునుంటిరా! ఖలా.

ఇంద్ర—(తనలో) ఓహో! యింద్రాదులైన నాకింత నిర్భయముగ బ్రతివచన మీయలేదె! యీకోతిని సామాన్య వానరమని తలంపరాదు. (ప్ర) ఓరీ వానరాధమ! అటులైన నిదే నా బాణముల నీప్రాణంబుల సర్పింపుము. రమ్ము రణమునకు.

(యుద్ధముసేయును.)

హను—ఓరీ! రాక్షసాధమ! నీవింద్రుని జయించినావని గర్వపడకుము వజ్రాయుధముకంటె నాతోకమీది రోమముయొక్క దెబ్బకు దాళలేక నీయబ్బయొద్దకో బోవలయును. (తోకతో గొట్టును.)

ఇంద్ర—(తనలో) ఔరా! వీనివాల ప్రఘాతము యమదండక్షతమును మించినదే! వీనిపై బ్రహ్మాస్త్రమునే ప్రయోగించి వీనినిగట్టి కొంపోయి మాతండ్రికి సమర్పించెదనుగాక. (ప్రకాశము) ఓరీ యిదే బ్రహ్మాస్త్రము కాచికొనుము. (బ్రహ్మాస్త్రమునువిడచును

హను—(తనలో) యీదివ్యాస్త్రమునకు బద్ధుడనై రావణుని యాస్థానమునకుబోయి వానితో బ్రసంగించిపోయెదను. (చేతులు జోడించి నిలచును.)

ఇంద్ర—భటులార ! వీనిని గట్టి కూడనకుని యాస్థానమునకు దీసికొని రండు. బ్రహ్మాస్త్రబద్ధుడగుటచే మీ కేమియు భయములేదు.

రాక్ష—చిత్తము (హనుమంతుని గట్టిమోసికొనిపోవుదురు.)

(అందరు నిష్క్రమించెదరు)

---

5 రంగము—సభాభవనము.

(రావణప్రహస్తులు ప్రవేశించెదరు.)

రావ—ప్రహస్తసచివోత్తమ !

గీ. కోతియెక్కడ బ్రాబల వి * ఖ్యాతిపరుల
నసురులనుగూల్చెగ దవింత * యయ్యెనాకు
బ్రహ్మమాత్రుడు కాకయా * వానరుండు
వనచరుండగ రాదు ధ్రు * వంబుసుమ్ము.

ప్రహ—స్వామి! రాక్షససార్వభౌమ ! ఆవనచరుం డకుకుమారాది రాక్షసుల ననేకుల జంపుటచే నట్లు తలంపవలసినదే కాని మనయింద్రజిత్తు వాని నశ్రముంబున బంధించి మీసన్నిధికి దేగలడు.

(ఇంద్రజిత్తు హనుమంతునితో బ్రవేశించును.)

ఇంద్ర—జనకా! యీవానరుండు సామాన్యుడు కాకుంటచే బ్రహ్మాస్త్రమున బంధించి మీసన్నిధికి దోడ్తెచ్చితిని.

రావ—వత్సా! మంచిపని జేసితివి. ఓరీవానరాధమ !

ఉ. ఎవ్వడవీవు వారినిధి ♦ నే క్రియదాటితి వెల్లదైత్యులన్
జవ్వదొలంచి చంపి వన ♦ సీమను బాడొనరింప నేల ని
న్నెవ్వడు పంపవచ్చితివి ♦ యెయ్యదినామము తెల్పుమోరి ! నీ
క్రొవ్వణచంచి మస్తకము ♦ ద్రుంచెద నీరుధిరంబు ద్రావెదన్.

హను—(తనలో) (ఈరావణు డున్నతాసనమున గూర్చుండుటయు నే నధస్థలమున నుండుటయునా! కావున నావాలమును బెంచి యున్నతాసనము నేర్పరచికొని వీనికి బ్రత్యుత్తరం బిచ్చెదను. (వాలసింహాసనమున గూర్చుండి ప్రకాశముగ) ఓహో! రావణ! నన్ను జంపుటకు బ్రహ్మాదులకైన దరముకాదు. నావృత్తాంత మడిగితివి కావున జెప్పెద వినుము

ఉ. నిర్జరవైరి నిన్ను ధర ♦ నేస్థలిగూల్చిన యట్టి కార్తవీ
ర్యార్జును వేయిబాహువుల ♦ నల్లన గొడ్డలిచేత దున్మి కీ
ర్త్యార్జనజేణ ధీరుడగు ♦ నాభృగురాముని లీలచేత నే
భర్జితు జేసినట్టి రఘు ♦ వల్లభురాముని దాసదాసుడన్.

అనగా ఆశ్రీరామచంద్రుని బంటు సుగ్రీవుడు. వానిభటుడను నేను. నాపేరు హనుమంతుడందురు. వాయుసుతుండను. శ్రీరామచంద్రుని యాజ్ఞచేత సీతాదేవిని వెతుకవచ్చితినిరా.

రావ—ఓరీ దుష్టవానర! నన్ను దిరస్కారము సేయుచున్నావుగా నిన్నిదె శిక్షించెదను.

హను—ఆయుంశము వేరురా రావణ! పరభామల హరించినసీకు దిరస్కారము కాక పురస్కార మెట్లువచ్చును.

రావ—నాపరాక్రమాగ్ని కింధన ప్రాయుడవుదువు!

హను—నీపరాక్రమము నేనెఱుంగకపోలేదు. చెప్పెదవినుము.

మ. తెలిదీవిన్ గెలువంగ బోవ నట సా ♦ ధ్వీరత్నముల్ నిన్నదా
తలలన్గల్గిన బుస్ట్వవచ్చెనిదె కాం ♦ తా జూడుమాయంచు జే
తులతో బట్టుచు నాటలాడ శ్రమచే ♦ దుఃఖించి తత్ప్రాణుల్గా.
బలవంతంబుగ బండ్లచే గఱచి రా ♦ వా రావణా యుక్తిచే.

అట్టి పరాక్రమశాలివి. నిన్నెవ్వ రెరుంగరు. నాయొద్ద నీప్రతాపముల జెప్పకుము.

రావ—ఓరీ వానరాధమ! నిన్నిదే చంపెదనురా! (కత్తి యెత్తును.)

ప్రహ—స్వామి! తాళుడు. దూతను చంపరాదు. వీనిచరిత్రమును సాంగముగ నడుగుడు.

హను—రావణ! నా యుపన్యాసము పూర్తియైన పిమ్మట నరుక వచ్చునులే వినుము నీతో గొంత చెప్పవలసియున్నది

రావ—అట్లైన చెప్పుము.

హను—ఆ శ్రీరామచంద్రుని మహిమంబు చెప్పెదవినుము,

చం. చలమునబట్టి వాలినటు ♦ చంపదలంచిన నీశిరాళి జం
కల నిరికించు కొంచు నల ♦ కంధుల నేడిట ఖండించిరాగ నీ
జలగ యిదేడయన్న రథ ♦ సంబున జావగ ద్రొక్కినట్టి యా
యలఘుని వాలిజంపిన మహా ♦ త్ముడు రాముడటం చెఱుంగుమీ.

ఒక్కకోలచే వాలినిగూల్చిన మహాపరాక్రమశాలియైన శ్రీరామచంద్రు నిల్లాలిని పర్ణశాలలో నొంటిగనుండగ మృగేంద్రాహారమును జంబుకమును తస్కరించిన విధమున తెచ్చితివి. ఆమెయే నీపాలికి మృత్యుదేవతయని తలంపుము.

రావ—ఓరీ మదాంధ వ్యర్థప్రలాపి అదేమిరా ప్రేలెదవు!

హను—ప్రేలకున్న నీకుబుద్ధి చెప్పుటయెట్లు. వినుము శ్రీరామచంద్రుడు నిర్వికారుడు. అవతారపురుషుడు. కరుణాసముద్రుడు. ఆశ్రితరక్షకుడు. కావున

చం. బ్రతుక దలంచితేని యప ♦ రాధిని బ్రోవుమటంచు వేడి యా
క్షితి సుత రామచంద్రునకు ♦ జేర్పుము లేక మదంబుచేత ను
ద్ధతి నెదిరించితేని నిను ♦ దప్పక రాముడు ఘోరబాణ సం
హతుల సబాంధకంబుగ మ ♦ హాహవమందు వధించు నమ్ముమీ

రావ—ఓరీ! వానరాధమ! సమస్తలోకముల జయించిన నావంటివాడొక్క నరాధమునకు దోసిలి యొగ్గుదునటరా.

హను—అట్లయిన నీవు చేసిన దుండగమునకు నీకులమెల్ల నాశనమగును. నీశరీరము గ్రద్దల పాలగును.

రావ—ఓరీ! వానరాధమ! చచ్చితివిరా. ఖడ్గము నెత్తి మీదకుబోవును)

విభీషణుడు—అన్నయ్యా! తాళుము. దూతనువధించుట ధర్మము కాదు (ఆవును)

రావ—అటులైన వీనితోకకు జైలవస్త్రముల జుట్టి యగ్నిముట్టించి కాల్చి పంపుడు.

ప్రహ—అది చక్కని యూహ.

హను—ఓరీ! రావణ! నాకీశిక్షవిధించిన ఫలమిప్పుడేయనుభవించెదవు.

రావ—ప్రహస్తా! వేగవీని తోక గాల్చిపంపుడు.

హను—(తనలో) ఈలంకయెల్ల గాల్చిపోయెదనుగాక.

(అందఱు నిష్క్రమించెదరు.)

---

6 వ రంగము—కిష్కింధ.

రామలక్ష్మణ సుగ్రీవులు ప్రవేశించెదరు.

రాము—వానరేశ్వర! సుగ్రీవ!

మ. హనుమన్నాముక వానరాగ్రణులు సీ ♦ తాన్వేషణార్థంబు జ
యన్న నాశాంతము వేగిరారచట నే ♦ మైనోక దా! జానకిన్
గనలేకుంట విషాద వహ్నిబడి మ్రు ♦ గ్గం జూచిరో యేమొ హా
యినపుత్రా! మదితల్లడంబు పడె నా ♦ కేదిక్కు చూపించితో.

సుగ్రీ—స్వామి! రామచంద్రమూర్తి! పత్నీవియోగభరంబున జేసి మీమనంబు పరిపరివిధంబుల బరితపించుచున్నది కాని హనుమదాదులు సఫలీకృత మనోరథులై యింతలోనే రాగలరు. కావున సైరింపుడు.

హను—జయము ! జయము! శ్రీరామచంద్ర! (నమస్కరించును.)
రాము—హనుమంతా ! జానకిని జూచితివా !
హను—

ఉ. కాంచితి జానకిన్ దనుజ • కాంతల కొల్వగ గండ్ల నశ్రువుల్
నించుచు రామచంద్ర ! ధర • ణీధవ ! హా హృదయేశ నన్ను బా
లించవె యంచు నేడ్చుచు జ • లించెడు దానిని లంకలోన నో
సంచిత పుణ్యశాలి ! యిక • సాగుము రావణుద్రుంప వేగమే.

రాము—ఓహో! ఆంజనేయ! నీమహోపకారమును నేను మరువజా లనుకదా ! ఆమెయేమని సంభాషించెనో సవిస్తరముగ జెప్పుమా.

హను—మహాప్రభూ ! ఆమహాదేవి లంకలోనున్నదని సంపాతియను ఖగేంద్రునివలన విని శతయోజన విస్తీర్ణమైన జలరాశినిదాటి లంకయను పురరక్షకురాలిని ద్రుంచి యందందువెదకి కానక తుదకశోకవనంబున దర్శింప

చ. ననుగని రాక్షసుండని మ • నంబున సంశయమందు చుండగా
గనకమయాంగుళీయకము • గ్రన్నన దేవి కొసంగినాడ నా
జననియు హర్షమొంది మది • సంశయము న్విడనాడి భక్తిమై
కనులనుసద్దికొంచు గుతు • కంబున దాల్చెను గంకణంబుగా.

రాము—ఆహా నాయంగుళీయక మామెకు గంకణప్రాయమగుటచే నెంతో కృశించినది కాబోలు

హను—దేవా ! ఆమహాదేవి యవస్థనేమని చెప్పుదును. మూర్తీభవించిన శోకదేవతవలె నొప్పుచు వేగవచ్చి రావణాదుల సంహరించి నాచెఱనూన్పి రక్షించుమనియు, లక్ష్మణుని యవివేకంబుచే దూలనాటిన ఫలం బిప్పుడనుభవించుచుంటిననియు బరిపరివిధంబుల శోకించిచెప్పి యానవాలుగ దనశిరోరత్నము నొసంగినది. యిదే ! దేవర స్వీకరించెదరుగాక. (యిచ్చును.)

రాము—(చేగొని) ఆహా! ఎన్నిదినముల కామైథిలీ శిరోరత్న సందర్శనమైనది

గీ॥ జానకీ వియోగ ♦ సంతప్తహృదయుడ
నైన నాదు తాప ♦ మార్పనీవు
సీతమౌళి భాసి ♦ చేరితివే నన్ను
మహిజమౌళి రత్న ♦ మా! కరుణను.

మారుతీ! అందలి రాక్షసులు నిన్ను గుర్తింపలేదు కదా!

హను—దేవా! గుర్తించుటయే కాదు సముద్రోల్లంఘన శ్రమచే బేరాకలివడి యావనఫలంబులభక్షించి వనమును విధ్వంసము సేయ నంత రావణసుతుండు అక్షయకుమారుం డనేక రాక్షసులతో వచ్చి నన్నెదిర్చి మడసినాడు. పిమ్మట రావణపుత్రుడిం ద్రజిత్తువచ్చి నామీఁద బ్రహ్మాస్త్రము బ్రయోగింప నేనందులకు బద్ధుడనై రావణునంతికంబునకుబోయి వానికి బుద్ధిజెప్పితి వాడందులకు గినిసి నాతోకకు జైలవస్త్రంబులజుట్టి అగ్ని ముట్టించెను. నేనిదేసమయమనియెంచి లంకాపురమెల్ల దగులబెట్టి కడలిలో దోకనార్పుకొని దాటివచ్చితి. నికజాగు సేయక సముద్రమును బాధించి లంక మీఁద దండెత్తవలయును.

రాము—ఓహో హనుమంతా! నాప్రియురాలిసేమమరసి వచ్చుటయె కాక లంక గూడ గాల్చివచ్చితివా! నీప్రభావ మనంతముకదా!

సుగ్రీ—దేవా! ఇక ననంతరకరణీయమునకై త్వరపడవలయు. రండు పోవుదము.

(అందరు నిష్క్రమించెదరు.)

---

7 రంగము—లంకాపుర సభాభవనము.

(రావణ విభీషణులు ప్రవేశించెదరు.)

విభీష—అన్నయ్యా! రావణసార్వభౌమ!

గీ॥ తరుచర మొకండు జల రాశి దాటివచ్చి
లంకగాలిచి పోయె ని శ్శంకగాను
జయము మనకగు ననుమాట స్వప్నవార్త
సీత రాముని జేర్చుటే శ్రేయమనుమి

రావ—ఓరీ అభిమానహీన! విభీషణ నీకింత సిగ్గు లేదేమిరా!

గీ॥ పరిభవము జేసినారు శూ ర్పణఖ ముక్కు
జెవులునుం గోసి దండక సీమలోన
ఖర ముఖాద్యసురుల నెల్ల నురుము జేసె
నట్టి వానికి మనకు స్నే హంబదేల

అవిధముగాక మంచియో చెడ్డయో ఆరాముని భార్య సీతనుచెర దెచ్చితిని. ఇపుడొక్క కోతివచ్చి లంకగాల్చిపోయినంతనే భయపడి సీతను రామునకిచ్చుటకంటె నావంటి పరాక్రమశాలికి జచ్చుటయే మంచిది. కావున నాకిట్టి విపరీతపు నీతులను జెప్పకుము.

విభీష—అన్నయ్యా! ఆరాముడు మానవమాత్రుడని తలంపకుము. తాటక సుబాహు ఖరదూషణాది సంహారము మొదలగు చర్యలను. అహల్యాశాపవిమోచనా మహిమయు దలంచిన రాక్షస సంహారమునకై యవతరించిన నారాయణునిగా దలంపవలయు నట్టిశ్రీరాముని భార్య సీతను నీవపహరించుట కులక్షయకారణంబు. ఆమెలోకమాత. శ్రీదేవి. నీవు త్రిలోకముల జయించిన వాడనని గర్వపడుచున్నావు నీవెట్టివాడవైనను నీవొనర్చిన యమంగళకార్యమే నీకు ముప్పుదెచ్చును. ఆతడు ధర్మమూర్తి ఆశ్రితరక్షకుడు. కావున సీతాదేవినిచ్చి శరణువేడిన రక్షించును

లేకున్న నీదుష్కార్యమువలన నీవు గాక మేమునూపుమా యుదుము. ఒక్క స్త్రీమోహమున సమస్తకులమును విధ్వంసము జేసికొను టుచితంబు కాదు. కావున సీతనర్పించుము కులమును గాచికొనుము.

రావ—ఏమీ ప్రేలుచుంటివి !

ఉ. భ్రాతను రాక్షసేశ్వరుడ ♦ బాహుభశక్తి నమర్త్యలోకమున్
ఖ్యాతిగెల్చినట్టి నను ♦ నల్పునిగా దలపోసి యొక్క దు
ర్జాతి నరాధముణ్ బొగడ ♦ స్వాంతము దెట్టుల సమ్మతించె నో
రీ ! తలద్రుంతు నన్విడచి ♦ యేగుము రాముని జేర వేగమే.

ఛీ కులద్రోహి ! నీవీక్షణముననె నాలంకనుండి తొలంగిపొమ్ము. లేకున్న నిన్నిపుడే చంపివైచెదను. (తన్నును)

విభీష—హా కష్టము కష్టము సరే ! ఓరీ రావణ ! నేనిపుడే యీలంకను విడచిపోయెదను. నన్ను నీసభాంతరమున దన్ని పరాభవించినావని నాకువిచారము లేదు కాని నీదౌర్మార్గ్యము కతమున్న రాక్షసకులమున కకాలప్రళయము సంప్రాప్తమైనదని విచారించుచున్నాను.

చం. అసదృశ రామచంద్ర విశి * ఖాగ్నిశిఖల్ పురిమీద బర్వి రా
క్షసులను గాల్చి నీతలల * జయ్యనరాల్చిన యప్పుడైన దా
మసమునదొలంగినావయిన * మాటలబాటి యొనర్పకుంటచే
ననులదొలంగుచుంటినని * యాత్మను దుఃఖముబొందకుందువే.

ఇదిగో ! నేనిపుడేపోవుచున్నాను. నీవు నీదుష్కృతఫలం బచిరకాలమున నే యనుభవించెదవుగాక. (కొంతవరకు నడచును.)

రావ—(మఱియొక దెసబట్టి పోవును)

కైకసి—(ప్రవేశించి) వత్సా ! విభీషణ ! నీవు నీఅన్నకు హితోపదేశము సేయుటయు నాతడందులకై కినిసి నిన్నవమానపరచు

టయు. వినియున్నాను. తొల్లి నీతండ్రి విశ్రవసుండు రావణ కుంభకర్ణులు లోకకంటకులై చరించుటచే మడియుదురనియు విభీషణుడొక్కడే వంశకర్తయగునని యు నానతిచ్చెను నీవు పోయి భగవంతుడైన శ్రీరాముని నాశ్రయించి బ్రతుకుము. నీకు భద్రంబుకలుగును.

విభీష—తల్లీ! మహాప్రసాదము. నానమస్కారముల గైకొనుము.

(నమస్కరించును.)

కైకసి—నాయన! వంశకర్తవుకమ్ము. (అందరు నిష్క్రమించెదరు)



8 వ రంగము—సముద్రతీరము.

(రామలక్ష్మణ సుగ్రీవ హనుమంతులు ప్రవేశించెదరు.)

సుగ్రీ—స్వామి! రామమూర్తీ!

ఉ అల్లదె మింటమేచక ము * హాఘనపంక్తివిధాన వచ్చుచున్

మెల్లన భూమికిన్‌దిగెను * మేదినివల్లభ! కాంచినావె! యా

పల్లదులైన రాక్షసులు * వా యునుపోయుచు లంకగాల్పగా

దల్లడమందుచున్ మనల * దార్కొన వచ్చెనటంచు నెంచెదన్

కావున మనల చేరకమున్న వారిని బరిమార్చెదము.

అందరు—(మింటజూచెదరు.)

రాము—సుగ్రీవ! వారిరాకకు గారణమరసియే తునుమాడవ నంత వఱకు నిదానించెదను.

విభీషణుడు—(చేతులుజోడించి ప్రవేశించి)

గీ శరణు స్వాశ్రితమందార! * శరణు శరణు

సర్వలోకేశ శ్రీరామ * శరణు శరణు

సకల మునిజనసన్నుత * శరణు శరణు

శరణుమాంపాహి రఘురామ * శరణు శరణు.

సుగ్రీవ—మహాత్మ ! రామచంద్ర ! యితడు మనకు బలిబల శాత్రవుడైన రావణుని తమ్ముడు. కావున రక్షించుట కనర్హుడు.

రాము—వానరేశ్వరా ! ఇతడు మనకు శత్రుకోటిలోనివాడైనను శరణన్న వానిని రక్షించుట మనకు విధి కావున రక్షింపకమానను. ఓదనుజకుమార !

మ. అభయంబిచ్చితినీకు నోదనుజ పు ♦ త్రా! మోదముంబొందుమా
వ్యభిచారుండగు దుష్టరావణుని ♦ సంహారంబు గావించి ని
న్నభిషేకించెద లంకలో సకల దై ♦ త్యాధీశ రాజ్యంబునర్క
శుభ మొప్పార దినేశ చంద్ర హిమభా ♦ నుల్ సాక్షిగా నమ్ముమా

విభీష—స్వామి ! రవికుల కమలాకరద్యుమణి మీసౌజన్యము భూమికలంకారము. నేను రావణుని తమ్ముడను విభీషణుడను. శ్రీరామచంద్రుని భార్యనపహరించుట మహాపాతకమనియు మృత్యువును దెచ్చునేయనియును నిపుడైన నాదేవిని నారామున కర్పించి శరణువేడుమని నీతిగఱపినందుల కాతడాగ్రహించి సభలోదన్ని పరాభవించి పురముహుండి వెడలనడచె. నేనాతని దౌర్జన్యమునకు సహింపక మీపాదము లాశ్రయింప వచ్చితి. కృతార్థుడనైతిని.

హను—స్వామి! రామచంద్ర!యీతడనాథుడు రావణుడు నన్నునరుకనుంకింప దూతను వధింపరాదని యాతనికి బుద్ధిచెప్పిన నీతిశాలి కావున నవశ్యమీతడు మీచే రక్షింపదగినవాడె.

రాము—యోగ్యుడగుటచేత నే యీతడు మనచెంతకు జేరినాడు. (తెరలో) ఓసుగ్రీవ ! మారావణ సార్వభౌముడు నీకుజెప్పమనిన పలుకుల నాకర్ణింపుము. నిన్ను సహోదరునిగ జూచుచున్న రావణునిపై గత్తికట్టి సామాన్యతాపసియై రామునితో సఖ్యముజేయుట బాడికాదు. నీసహాయము లేకున్న నీవరుడు

జలరాసి నుత్తరింపజాలడు. కావుననీయెడల భ్రాతృవాత్సల్య
ముంచి యీరాముని విడచి నీయనుచరులతో నాకుసహాయుడ
వుకమ్ము లేకున్న గిష్కింధకుబొమ్ము అని

సుగ్రీ—(పైకిజూచి) ఓరావణచారా ! నీవాపంక్తివదనునితో సుగ్రీ
వుసిపలుకులుగా నిట్లు పలుకుము.

సీ. వాలియట్టులనాకు ♦ భ్రాతవౌటనిజంబు
దుష్కార్యమున జెల్మి ♦ తొలగెననుము
ధరణీకుమారిక ♦ దస్కరించుట మృత్యు
దేవత స్వాయముగా ♦ దెచ్చుటనుము
జగము రాక్షసముగా ♦ నలుపంగ గపులతో
వనధి లీలగదాటి ♦ వత్తునను
అల త్రికూటాద్రితో ♦ నాలంక బెకలించి
వారాసిలోగల్పి ♦ నైతుననుము

గీ. రామలక్ష్మణతీవ్రనా ♦ రాచవహ్ని
రావణద్రోణకర్ణ శ ♦ క్రి జిచ్ఛలభ
చయముగాల్చెడు నసివిభీ ♦ షణుడు ముదము
జెందురాక్షస రాజ్యసు ♦ శ్రీవహించి.

రాము—ఓహో ! వీడు మనకు భేదభావము గల్పింపవచ్చిన రావణుని
దూతవలె నగపడుచున్నాడే !

హను—దేవా ! నేనాకసంబున కెగిరి వానిని బట్టితెచ్చెదను.
(నిష్క్రమించి శుకునిపట్టితెచ్చును.)

శుకుడు—స్వామి ! రామచంద్ర ! నేను రావణుని మంత్రిని శుకుడను
వాడను. ఈ హనుమంతుని తోకదెబ్బలచే జావకుండ
రక్షించుడు.

రాము—ఓరీ నీ వెందులకై వచ్చితివి ?

శుకు—దేవా ! నేను సుగ్రీవుని సైన్యమునుండి విడదీసికొన్నని మా రా
వణుండంప వచ్చినవాడను అపరాధిని ప్రాణదానం బొసంగుడు.

రాము—ఓరీ అధముడవైన నిన్ను జంపరాదని విడచితిపొమ్ము.

శుకు—మహాప్రసాదము. (నిష్క్రమించును)

రాము—సుగ్రీవాదులార ! కడలికి వారధిగట్టు వరకాదర్భశయ్య
నుండి విభీషణునితో బ్రసంగించుచుండెదను. మీరుమీ కార్య
ముల నెరవేర్చుచుండుడు.

సుగ్రీ—చిత్తము (అందరు నిష్క్రమించెదరు.)





శ్రీ

# సంపూర్ణ రామాయణ నాటకము.



## దశమాంకము.



### 1 రంగము—గగనమండలము.

(గంధర్వుడు కలహంస ప్రవేశించెదరు.)

గంధ—దేవీ కలహంస !

గీ. ఏమి సంభ్రంబు లేకమై యేగుదెంచు
పగిది రాముడు వానర బలముతోడ
సరగ నీలంకలో జొచ్చె హరిహరులకు
నేది దుస్సాధ్యమీ భూమిమీద జెలియా.

కలహ—నాథా ! అదిసత్యమే. రాముడు లంకలోబ్రవేశించినాడని విని మంత్రులతో దురాలోచన మొనరించివిద్యుజ్జిహ్వునిమాయా కల్పిత రామలక్ష్మణశిరంబులశరంబులతో సీతయెదుట బెట్టింప నదిగాంచి సీత యెట్లుశోకించుచున్నదో.

గంధ—ప్రియురాల ! ఆశ్చర్యమాశ్చర్యము. అంతలోనే ఆమాయ శిరంబు లంతరించుటచే జానకి శోకమునుండి విడువబడినది చూడుమా.

కలహ—అమ్మయ్యా! నాప్రాణము లిప్పటికి బొందింజేరినవి.

గంధ—చెలీ ! అదే మాల్యవంతుడు చెప్పెడునీతులను సరకుసేయక రావణుడు సకలరాక్షస బలముతో వానరబలముతో నప్పుడే

తలపడినాడు. సుగ్రీ...
నెట్లు చిరుకదొ్రిక్కుచున్నా...
కలహా—యీసాపు డీదెబ్బల'(జావవలసినే...
కాని అక్కటా! అంతలో నేయింద్రజిత్తువచ్చి...
నెట్టు నాగపాశబంధితుల జేసినాడో.
గంధ—భయపడకుము, నారదప్రబోధితుండై తానుశ్రీపతినని...
కొని గరుత్మంతునిదలప నాతగేందు్రుడువచ్చి బం: విముక్తుల
జేసినాడు, రాఘవులెట్లు శోభిల్లుచున్నారో చూడుము.
కలహా—బలే సంతోషమయ్యెను. అల్లదే ధూమ్రాక్షాకంపనమహా
కాయప్రహస్తులు అంగద నీలాదికపుల కోదలపడి మడసినారు.
గంధ—చెలీ! ఆవంకజూడుమూ రావణుండు హనుమంతునిచే జావ
దెబ్బలుతిని లక్ష్మ సింహాశరశాతనఖంబుల జర్ఝరీకృత దే
హుడైసహింపలేక కుంభకర్ణునిమేల్కొల్ప భటులను దరుము
చున్నాడు.
కలహా—నాథా! వానికిగలత నిద్దురయనుటచేగాబోలు ధూలిపడుచు
గుంభకర్ణుడు రణరంగమునకు వచ్చుచున్నాడు.
గంధ—అదిగో! తానన్నినీతులు రావణునకు జెప్పినను వినకుంటచే
మండిపడుచు జన్యమునకువచ్చి రాముని తోబోరిరసాతలమదుర
గూలినాడు చూడుమా!
కలహా—అబ్బా! చచ్చినను వీనియాకారము భయంకరముగా నేయున్నది
గదా!
గంధ—చచ్చినవానినేమి చూచెదవు. ఆకేళివలక్ష్మణుండు విలయకాల
రుద్రునివలెమండిపడుచు నింద్రజిత్తునిగూడ గూల్చినాడు. దేవత
లుపుష్పవర్షమును గురియుచున్నారు.
కలహా—ధర్మము జయమనుమాట లూరకపోవునా!

చచ్చిటచే బట్టరానికోపంబున

ని బ్రయోగించి రామానుజునిగూల్చి

తమ్మునియవస్థకు రామచంద్రుడిట్లు శోకించు

నాథా ! మనమీ ప్రాంతమును విడచి యచ్చటికే పోవుదము రండు.

(ఇద్దరు నిష్క్రమించెదరు)

---

2 రంగము—యుద్ధభూమి

(మూర్ఛిల్లిన లక్ష్మణునితో రాముడు సుగ్రీవ హనుమంత విభీషణులు ప్రవేశించెదరు.)

రామ—హా సహోదర ! లక్ష్మణ !

ఉ. అన్నవనీకి యుండగల ♦ నా ! యని తల్లిని భార్యనూర్మిళ
గ్రన్నన వీడి నా వెనుక ♦ గానలకుగ్గు భక్తివచ్చి నీ
వెన్నియొకష్టముల్గుడిచి ♦ యీగతి బ్రాణముబాసినావె ! నీ
యన్నలమిన్న కేమిగతి ♦ యంచు వచించెదనయ్య తమ్ముడా.

హా రామమహా జీవిత ! సౌమిత్రి ! నేనెంత నిర్భాగ్యుడనురా తమ్ముడా

ఉ. భండనరంగమందు బరి ♦ పంథుల మృత్యుపురికి జెందిడి యు
ద్దండసుకీర్తిగాంచియును ♦ దానవనాథుని శక్తిచేత భూ
మండలిగూలినావె ♦ ఘనమండన ! ని న్విడనాడ మేనిలో
నుందునె ! ప్రాణపంచకము ♦ యో ! యిక సంగర మేల తమ్ముడా.

హా భ్రాతృవత్సల ! హా నిరుపమాన పరాక్రమశాలి ! లక్ష్మణ !

విభీ—స్వామి ! విచారింపకుడు ధైర్యమవలంబించుడు

రాము—విభీషణా ! తమ్మునిజంపుకొన్న యీ అదృష్టహీనునకు ధైర్య మెట్లువచ్చునోయి హా సౌమిత్రి.

చం కులసతి వ్రావ వేఱొకతె • గోమలి గూర్చుకొనంగవచ్చు బం
ధుల గడియింపవచ్చు గుణ • ధుర్యుని నీకెనయైన భ్రాత భూ
తలమున వెన్ను పంబు నిరతంబు • నొనర్చినగాని గాంచగా
గలుగుదునే! సమస్తము జ • గంబు దహించివిన రీతినయ్యెగా
హాలక్ష్మణ! సుమిత్రాగర్భపాదోధిచంద్ర! లక్ష్మణ!

హను—అక్కటా నాకష్టమంతయు గంగపాలైనది. ఈమహాత్ముని కంటె నాకువిచారము హెచ్చుగనుండ నేనెట్టు లోదార్చ గలుగుదును. దైవమా!

రాముడు—

ఉ. ఆలిని సీతదైత్యులకు • నర్పనజేసి దశాన్యుశక్తిచే
గూలిచినిన్ను ! గీర్తిరమ • కుఱ వెలియాచును నాయయోధ్య కే
లీలనుపోదునొంటిగఁజ • లింపక నీజనయిత్రి లక్ష్మణుం
డేలొకొరాకపోయెనని • యేడ్వగ నేమనిపల్కువాడరా.

అయ్యో! నాకుమాత్రమిక యయోధ్యయేల నేనుమాత్రము బ్రతుకు దునా! హాలక్ష్మణ! (మూర్ఛిల్లును.)

సుగ్రీవు—(లక్ష్మణునిదానించి రామచంద్ర! విచారింపకుము. మన లక్ష్మణుడు మూర్ఛనేపొందెనో. లేక ప్రాణములనేబాసెనో సుషేణుడువచ్చి నిర్ణయించును.

సుశేనుడు—(ప్రవేశించిచూచి) స్వామి! మన లక్ష్మణకుమారుడు. మూర్ఛనందెను. కాని ప్రాణములబాయలేదు. హనుమంతుడు సంజీవిని దెచ్చిన జీవింపగలడు. విచారింపకుము.

రాము—(లేచి) సుషేణానిజమేనా! హనుమన్నా! నీవు మరలపోయి ద్రోణాచలమును దెచ్చి నాకు భ్రాతృదానమును సేయుమా!

హను—మహాప్రభో! అటులైన తత్క్షణమేపోయి తెచ్చెదను.

సుషేను—ఆంజనేయా! సూర్యోదయము కాకమున్న సంజీవిని దెచ్చి తివేని లక్ష్మణుడు జీవింపగలడు.

హనుమం—అట్లయిన నిదే పోవుచున్నాను. (నిష్క్రమించును.)

రాము—మారుతీ! నీకు మధ్యేమార్గంబున భద్రమగుగాక సుగ్రీవ! యిట్టి సుగుణరాశియైన తమ్మునిఁ గోల్పోతినోయి.

ఉ. ప్రాణమువంటి భార్యనెడ • బాసి యిహంబులరోసి తల్లిఁనీ
మానుగవీడి దేవుని స • మానుడు భ్రాతయటంచు నన్నె స
న్మానము జేసి కానలకు • నా వెనువెంటనె వచ్చినట్టి సు
జ్ఞానిని వీనిలక్ష్మణుని • సంగరమందున జంపుకొంటిగా

సుగ్రీవు—స్వామి! విచారింపకుడు. హనుమంతుడు సంజీవిని దెచ్చుట తడవుగా మీయనుజుండు బ్రతుకగలడు.

రాము—(తూర్పువైపుజూచి రోషముతో) ఔరా! ఏమీ! యీప్ర భాకరుని దౌర్జన్యము.

ఉ. జీవనజాప్త నాయనుజు • దుర్వినిమూర్ఛిల వాయుజుండు సం
జీవిని దెచ్చి లక్ష్మణు స • జీవునిగా నొనరింపకుండగా
నీవిధి దూర్పుకొండ నుద • యించుటె యాత్మకులాభిమానముం దగ
బోవిడి మచ్ఛితాస్త్రముల • భూమిని రాల్చెద నిన్నుజూడుమా.

(బాణము నెక్కుపెట్టును.)

సుగ్రీ—మహాత్మా శాంతింపుము.

గీ. ఏవిధాన లక్ష్మణుని స • జీవిఁజేతు
ననుచు మారుతికృత కార్యు • డగుచు దెచ్చు
ద్రోణగిరిమీది యౌషధీ • ద్యుతులెకాని
కమలమిత్రుని యుదయంబు • కాదు దేవా.

రాము—ఔనోయి సుగ్రీవ! నేను మతిలేక యట్లుతలంచితి నల్లదే హనుమంతుడే సంజీవితో వచ్చుచున్నాడు.

హనుమం.—(ప్రవేశించి లక్ష్మణునకు ముట్టించును.)

లక్ష్మణుడు—(లేచి ధనుర్బాణంబులగైకొని)

ఉ. పోకుము పోకుమోఖలుడ! భూరిబలార్జిత శక్తినైచి చీ
కాకొనరించినాననుచు గర్వముజెందగ రాదు మచ్చరా
స్తోకశిఖాగ్నులన్ బరపి తుంచెద నీదశమస్తకంబులన్
గాకులపాలు నీదయిన కాయమురమ్ము రణమ్ముసేయగా

రాము—(లక్ష్మణుని గౌగలించుకొని) తమ్ముడా! తాళుము రావణుం డప్పుడే పోయినాడు కాని మరలనీవు జీవింపజాలనంత మూర్ఛ నందితివి. యీహనుమంతుండు సంజీవినిదెచ్చి నీకు బ్రాణ దానమును జేసినాడు.

లక్ష్మ—ఏమీ! నాయవస్థ అంతకుదెచ్చినదా! ఆపాపురావణశక్తి

రాము—ఆ అటులే. (హనుమంతుని గౌగిలించుకొని) అన్నా! హనుమన్న!

ఉ. అమ్మొయి గోలుపోయిన ప్రియాంగన సేమముదెల్పి దైత్యయు
ద్ధమున మూర్ఛచేబడిన తమ్మునిప్రాణము నిల్పినావు నా
తమ్ములకంటె నెక్కుడగు తమ్ముడవీవు కదన్న! యెన్ని జ
న్మములకైన దీర్ప గలనా! భవదీయ ఋణంబు మారుతీ.

హను—స్వామి! మీచరణ సేవకునింతగా జొగడవలదు. భవిష్య త్కార్యమునకు గడంగుడు.

సుగ్రీ—అదిగో లక్ష్మణుండు లేచుటగాంచి రావణుండే మరల సమ రమునకు వచ్చుచున్నాడు.

లక్ష్మ—మంచిది. రానిమ్ము వానినీసారి తుదముట్టించెదను.

రాము—తమ్ముడా! నీవలసియున్నవాడవు నీవుతాళుము. నేనెవానిని సంహారించెదను.

రావణుండు—(ప్రవేశించి) ఓరీలక్ష్మణ! చచ్చితిననుకొంటిని కాని

తిరిగి అంజనీసుతుడు సంజీవిని దెచ్చుటచే మరల బ్రతుకుగంటివా రమ్మిప్పుసారి నీప్రాణముల దీసెదను.

లక్ష్మ—ఓరీ దశకంధర! నీకంఠవిలుంఠనమహోత్సవమిప్పుడే యగును కాచికొనుము

రాము—తమ్ముడా! నీవటుతొలగుము. ఓరీ రావణ! లోకవిద్రావణ!

చ. పరమపతివ్రతామణుల ✽ బల్మిమెయిన్ జెఱదెచ్చి నీ
గురుతర పాపసంచయము ✽ కోటిగుణాధికమై మదీయభీ
కరశరవహ్ని వ్యాజమున ✽ గ్రన్నన నిన్ దహించుజుమ్ము సం
గరమున దుష్కృతమ్ము వ్యథగా ✽ హరియించునె! దానవాధమా

కావున నలసియున్న పసివానితోస్నీకేల నాతో రణము శేయుము.

రావణు—ఓరీ నరాధమ!

ఉ. తాటక నానుసాహు ముఖ ♦ దానవనాథుల గూల్చినంత నే
పోటరినంచు గర్వమున ♦ బొంకకుమో రఘురామ! నిన్ను నా
ఖేటముచేతద్రుంచి ఘన ♦ కీర్తిని గాంచెద నన్నెదుర్ప నా
హాటకగర్భ శంకర ము ♦ ఖాదులకైన వశంబె! యాజిలో

కావున నేడే వైశ్రవనునిచే నీకాయువు మూడినదని తలంపుము.

రాము—ఓరీ రాక్షసాధమ! ఎందులకీ ప్రతాపములు నిన్ను నిర్జించుటకు బ్రాహ్మదులేల నేనేల నీదుష్కృతమే చాలును. రారమ్ము రణమునకు.

రావ—ఓరీ! దాశరథి! నేను సుకృతములనే చేసితినో దుష్కృతములనే చేసితినో తెలియుటకు నీవెంతవాడవురా!

చ. గురుతర భక్తి నేను నవ ✽ కోటి శివాలయశంకరార్చనా
భిరతిని బొల్చినాడ భుజ ♦ విక్రమ నిర్జిత నిర్జరేంద్రుడై
వరలుచునుండునా సుకృత ✽ వైభవమీవు హసించినంత నే
దొఱగునె! వ్యర్థవాదముల ✽ తో బనియేల రణమ్ము శేయుమా.

రాము—ఓరీ నిశాటాధమ !

చ. విమలసుధాబ్ధిలోల విష ♦ బిందువుగల్పఁ, గలంబుజెందిన
ట్లమరవిరోధి! నీదగు శి ♦ వార్చనపుణ్యఫలంబు నీదు దౌ
ష్ట్యమునను దగ్ధమయ్యెను దృ ♦ ఢంబుగనమ్ముము తావకీనప్రా
ణములకుమృత్యువౌ జనక ♦ నందనఁబట్టిన రిత్తవృత్తినే.

రమ్మిక యుద్ధముసేయుము.

రావణ—రామా! నాపుణ్యఫలము దగ్ధమయ్యెనో నిన్ను జూపుపట్ల
వై దగ్ధముసే తాంచెనోయిప్పుడే చూచెదవుగాకరమ్ము.

మాతలి—(ప్రవేశించి) మహాత్మా! నేనింద్రసారథిని మాతలిని
పురంధరుండు సభక్తికంబుగ మీకరదము బంపఁదోలి తెచ్చితిని
అధిష్టించి సమరమొనర్పుడు

రాము—దివ్యుల కృపాభిషేకమునకు సలయొగ్గితి ఓరీరావణ! అనిమ్నల
స్థలమునకుబోయి యుద్ధము సేయుదమురమ్ము

రావణ—మంచిది (ఇద్దరు నిష్క్రమించెదరు)

సుగ్రీవు—రామానుజ! వానరులార! రామచంద్రుండు రాక్షససం
హారమవతరించుటచేతనే యింద్రుఁడు రథమునంపినాడు.

విభీష—అందుకు సందియమేమి! అల్లదేచూడుము మహాత్ముఁడు రావణు
నెట్లు బాణవర్షమున ముంచుచున్నాఁడో.

హనుమం—ఆహా! రామ రావణ సమరము దుర్నిరీక్ష్యముగనున్నది
కదా!

గీ. రామబాణాళి మేను ♦ ఛిద్రములసేయ
రక్తధారల గుటియు నా ♦ రావణుండు
యెఱ్ఱకాల్వలబారు మ ♦ హాధ్రమనఁగ
నొప్పుచున్నాఁడు కనుడు ర ♦ ణోర్వియందు.

సుగ్రీవు—అన్నన్నా! ఇదేమి విచిత్రమో యు విభీషణ!

ఉ. రాముడు త్రుంచివైచినను ♦ రావణు వింశతి బాహువుల్ తలల్
వే మరు మొల్చుచుండె నిది వింతకదా ! భవదీయ సోదరుం
డేమి తపంబు జేసెనొకో ♦ యిట్టి విచిత్రముగాంచి రాముడ
య్యో మదిదోచకుండె సమయోచిత కార్యము జెప్పవే సఖా.

విభీ—సుగ్రీవాదులార ! మీరందులకై చింతిల్లకుడు. దీనికుపాయము రామచంద్రునికే యెఱిగించెదను. వినుడు మహాత్మా ! రామచంద్ర !

ఆ. వె. అమృతకలశ నాభి ♦ యందుంచున్నట్లుగా
నజుడు వరమొసంగె ♦ నందుచేత
దలలు మొలిచె నాభి ♦ తలమును గొట్టుమా
పావకాస్త్రమునను ♦ భవ్యచరితా.

అట్లుచేసినగాని వీడు సాధ్యుడుకాడు.

హనుమం—ఓహో ! అధర్మపరునకాత్మజుడైన సాయపడదుకదా !

సుగ్రీ—(హర్షించుచు) అదిగో రావణుడు కూలినాడు యిప్పటికిగదా! కృతార్థులమైతిమి !

విభీష—(కూలబడి) హా అగ్రజ ! రావణ ! నీకెంతగతి పట్టినదోయి.

మ. పరకాంతామణులన్ హరించుట మహాపాపంబు వద్దంచు వే
మరు సద్బోధనజేసినన్ వినక యి ♦ మ్మాన్మశ్రీన్ రఘూత్తమను భీ
కరశస్త్రంబులగూలితే ! శివశిరః ♦ కంజంబునై యొప్పు నీ
శిరముల్ గద్దలుతిన్న నేనెటుల వీక్షింతున్ గటా సోదరా !

రాము—(ప్రవేశించి) మిత్రమ ! విభీషణ ! నీయగ్రజుం డిహమున జేసిన పాపము నిహలోకముననే యనుభవించి నాచేగూలి యదే పుష్పకారూఢుడై పుణ్యలోకముల కేగుచున్నాడు. అదే చూడుమా నీవాతనికొరకై విచారింపకుము.

విభీ—స్వామి ! చిత్తము.

రాము—హనుమంతా రావణుని కిరీటము నిటుతెమ్ము.

హను—(తెచ్చియిచ్చును.)

రాము—విభీషణ !

శా. శంకింపంబనిలేదు రావణుడనిన్ • జచ్చెంగదా యుంచు ద
త్పంకంబింతయొనర్చె జేకొనవె • యీదైత్యాధిపత్యంబు నా
పంకజాప్తసుధాంశుతారకముగా • చాలింపు కోపమ్మింక నీ
లంకారాజ్యము నోవిభీషణా ! • గుణాలంకార దైత్యేశ్వరా.

(కిరీటము విభీషణుని శిరమునబెట్టును.)

విభీ—స్వామి ! మహాపతివ్రతయగు నేనిపుడేపోయి సీతామహాసాధ్విని దెచ్చినమర్పించెదను. (నిష్క్రమించి సీతతో బ్రవేశించును)

సీత—హా ప్రాణేశ్వర ! (నమస్కారముచేసి పదములబడును)

రాము—దేవీ ! నీవుభర్తృసుకలువగాక ! నీచెరయూర్పితిని కాని చిరకాలము పరసన్నిధినుంటచే నీవగ్నిచేత బరిశుద్ధురాలవైనగాని పరిగ్రహించుటకు యోగ్యురాలవుకావు

సీత—హాదైవమా ! సరే నాథా ! నిర్దోషినైన నేనసలపరిశుద్ధినిగాంచుటకు సంశయింతునా !

రాము—పావనీ ! నీవుపోయి యగ్నిని బ్రజ్వరిల్లజేయుము.

హను—చిత్తము. (నిష్క్రమించును తెరలో అగ్నిమండును)

సీత—ఓహో ! భగవంతుడువైశ్వానరుండిదో వెలుంగుచున్నాఁడో ! స్వామి ! వీతిహోత్రి ! దేవముఖ ! (అగ్నిని జేరి)

చ. నిరతము రామచంద్రధర • ణీపతినేమదినెంచితేని యా
శరపతిపంక్తికంధరుని • స్వప్నమునందునైనదల్పకుం
డరవిందజెలంగితేని సుజ • నస్తుతపూతచరిత్రనేని యీ
యుతరవహ్ని శాంతమయి • యొప్పుచు నన్గ్రహింప కుంతుత్రకా.

(అగ్నిలోనురుకును)

విభీ—ఓహో! మహాపతివ్రత నాదరించి హవ్యవాహనుండు స్వయముగ జానకీదేవి నిటుతోడి తెచ్చుచున్నాడే!

అగ్ని—మహాత్మా! రామచంద్రా! యీసీతామహాదేవి నాలోపలలో బ్రవేశించుటచేత నాపాపములుగూడ నాసిపోయినవి యీమె మహాపతివ్రత దోషరహిత కావున నీమెను సంశయింపక స్వీకరింపుము.

బ్రహ్మ—(ప్రవేశించి) స్వామి! రామచంద్ర! భూభారము నడంచుట్కై రామావతారమెత్తిన నారాయణుండవు యీవిధంబుగ నీ త్రొల్లి రాక్షస వధార్థమై మీనాద్యవతారములదాల్చిన పురాణపురుషుండవు. నీవలన భూభారమునశించినది. దివ్యులు రక్షోభాధదొలంగిరి. ఈమె ఆదిలక్ష్మిగాని నరకాంత కాదు. పరమ పవిత్రురాలు. నీవు సంశయింపక యేలుకొని అరువదివేల దివ్యవర్షంబు లీభూమినిబాలించి ధర్మప్రతిష్ఠ జేసి పిమ్మట వైకివచ్చెదవు. ఈతడగ్ని. నేను బ్రహ్మను.

రాము—దేవతలార! మీకందరక నేక వందనశతంబులు మీయాజ్ఞచే నేనీమెను స్వీకరించెదను. (సీత చేయిపట్టుకొనును.)

బ్రహ్మ—మీరందరు మహేంద్ర పేరితమైన పుష్పకము నక్కియయోధ్యకుబోయి రాజ్యపట్టాభిషేకమునుబొందుము. రామచంద్రా! త్రొల్లి నీయానతిచే నీకు సహాయార్థము వానరావతారముల దాల్చిన దివ్యులుకాని పీరితరులుకారు. మఱియు నీకింకేమి కావలయును?

రాము—పితామహ! పిత్రాజ్ఞచే బనునాల్గేడు లరణ్యవాసవ్రతమును బూర్తిచేసితిని. గోలుపోయిన భార్యనుమరల బొందితి. దుష్టసంహార మొనరింపబడె నాకింకేమి కావలయును. అయిన నిట్లగుగాక.

మ. అవసరీ బుష్పవరుల్ పరాంగనల కై • యాశింపగారాదు ధ
ర్మవిశేషంబున బొల్చుగావుత ప్రజల్ • మాత్సర్యముల్ బాసి యీ
భువనంబు లీసమవృష్టిసస్యఫల సం • పూర్తిన్ విడంబించుత
గవిమాణిక్య సుధారసో క్తులిలన్ • గళ్యాణము ల్గూర్చుత.

బృహన్న }
అగ్ని } తథాఅస్తు తథాస్తు.

ఇది శ్రీకాశ్యపసగోత్ర చక్రావధాని వంశపయః పారావార రాకా
సుధాకర నారసింహారత్యనూభవ నరసమాంబా గర్భశుక్తి
ముక్తాఫల సంపూర్ణభారత శ్రీకృష్ణలీలానేక నాటక
రచ నాధౌ రేయ మాణిక్యశర్మ ప్రణీత
సంపూర్ణ రామాయణ నాటకము
సర్వము సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ



శ్రీచింతామణి ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరం. —1929

1888 1

# సంపూర్ణ రామాయణ నాటకము

## లోని సాంగ్సు.

[దశరథుడు రామలక్ష్మణుల విశ్వామిత్రునికి నర్పించుపట్ల.]

(1) కళ్యాణి రాగము—రూపకము.

1. విడువజాలగదరా రఘు । వీరా ! లక్ష్మణ మిమ్ముల॥ విడువ॥

గడియయే, యొక యుగమా । గద రా ! నేనెటులనైచెద ॥విడువ॥

2. పూపప్రాయమున రాక్షస । మూక నెట్లు దునుమగలరో

తాపసిజన్మముగాయగ 'దగుదురే నా చిన్నలార ! ॥విడువ॥

3. ఏమిసేతు నెటులనైతు । నాముద్దుకుమారులార।

యీముని కౌశికుకృపయే । నోముగాత మిమ్మునతము॥ విడువ॥

(2) [దశరథుడు రామలక్ష్మణ సీత లడవికిబోవుపట్ల]

కన్నడరాగము—జంపితాళము

1. నాపుణ్యనిధులార । నాప్రాణపదులార ! యెటుగిది మిమువిడచి

యిల బ్రతుకువాడ॥ నాపుణ్య॥

2. నాపాలిమృత్యువై । యీపాపి నీకైక । నాపాపమేమందు । నీప

గిది జేసెన్॥ నాపుణ్య॥

3. రాజ్యంబువిడచి ఘో । రారణ్యములలోన । నేరీతిజరియింతు రా!

రామ రామ; ॥నాపుణ్య॥

4. తల్లిరో జానకీ । తనయలక్ష్మణ కైక । వల్ల నెంతటి దుర । వస్థ

వచ్చెగదా॥ నాపుణ్య॥

(3) [సాంగు సీతారామలక్ష్మణులు దశరథుని విడచుపట్ల.]

సావేరి—ఆది.

1. ఎన్నడైన నిన్నుజూడగలమో । యినకులక్షీరాంబోధిశశాంకా ।
కన్నులందు దుఃఖాశ్రులనింపకు । మన్న యోర్చియుండుమెట్టులో
మది ॥ఎన్న॥

2. కైకమున్ను వరములవాణ్ణేసిన । కారణమున గోపింపకుమయ్యా ।
శోకించినమానునె ప్రారబ్ధము । లోకావనదశరథ ధాత్రీశా॥ఎన్న॥

3. మున్ను హరిశ్చంద్రుడు నళరాజును । బన్నములకు శాల్పడరేవన
ముల నెన్నగవారలకంటె ఘనులమే । విన్నదనంబికమానుము
జనకా ॥ఎన్నడై॥

(4) [సాంగు భరతుడు తండ్రికొరకు శోకించుట ]

పీలురాగము—రూపకము.

1. మమ్మగన్నతండ్రి భూత । లమ్ము బాసిపోయినావె !
యిమ్మెయి మీసుతులమాకు । నేదిదారిచూపితే ॥మమ్మ॥

2. అక్కటా నీవస్తమింప । నంధకారమయ్యె జగతి ।
దిక్కికేది మాకుతండ్రి ! దేవ కార్యతత్పరా।

3. అయ్యయో మాకేదిదారి !। అయ్యమాకు గరవైతివా! ।
నెయ్యమునను మమ్ము ప్రేమ గ । ణించెడు వారెవ్వరయ్య॥మమ్మ॥

(5) [సాంగు భరతుడు కైకనుదూరుట. బేహాగు—ఆదితాళము.

1. అకటా! యెంతటి । హంతకురాలవు । కాంతుజంపితివో । కైకా
దుర్మతి ॥అకటా॥

2. ఛీ, ఛీ, నీమోము । జూచినపాపము । దోచును మాటలతో।బని
యేలనే ॥అకటా॥

3. శ్రీరఘురాముని । సీతను లక్ష్మను । ఘోరాటవులకు । బార
దోలితివె ॥అకటా।

(6) సాంగు, రాముడు సీతనూరార్చుట. కళ్యాణి—రూపకము.

రాము—1. దేవీ జానాకివనుల । దిరిగి శ్రమలపాలైతివె దేవీ
ఆవిధిశుద్ధాంత సౌఖ్య । మడవిగలసిపోయె నయ్యో ।దేవీ

సీత—2. దేవా నాకైమది చిం । తిల్లబోకుడీ కష్టమనుచు ।దేవా।
ఆవిధి యిటుల్వ్రాయు దాటఁసలవిగూనె! ప్రాణానాయక దేవా

రాము—3. యీభీకర వనులలోన । నెట్లుమెలగుదో తోచ దేవి
యేకడజూచిన రాక్షస । మూక లేకదా! సారసాక్షి । దేవి

సీత—4. నాథా మీవెంటనుండ । నాకుభీతి యేలకల్గు ॥నా॥
బాధలెల్ల సౌఖ్యములై । పరిణమించవే । వంత యేల ॥దేవా

(7) [రామలక్ష్మణులు తండ్రి మరణమునకు శోకించుట]

భైరవిరాగము—ఏకతాళము.

1. హా తరణికులాబ్ధి సుధాకర । దశరథ ధారుణీశజనకా । నను విడ నాడితివే ॥హాతరణి॥
అసురకులము సంహారామొనరించి । అమరసంతకి జయముగూర్చిన మేటి । అనులదొలంగి మీ । కనుగాయులమన్న । వెసదుఃఖాబ్ధిని దోసితివయ్యో ॥హా॥ తరణి॥

2. ప్రాణము లైదును । రాముని పైనిడి । కానలకే నేరానోరువ లేక । హా నానుతులార । రామలక్ష్మణులార । అనుచు ప్రాణముల । ద్యజియించినావె ॥హాతరణికు॥

(8) [సాంగు రాముని శూర్పణఖ వర్ణించుట.]

శంకరాభరణము—త్రిపుట.

1. ఎంతో అందగాడో । యీరామా । చంద్రు ॥డెంతో॥
నడుమోమున వెన్నెలబోలిన । నవ్వులొలయు గన్నులు కల్వలు యింద్రనీల కందళముల రుచి । సాంద్రమయ్యె మేని హారంగులు ఆహా ॥ఎంతో॥

2. ఔరా యీమోహనమూర్తిని । జేరి కౌగలించి సుదారసధార
లోల్కుమోవినిగ్రోలని । వాని జన్మమేల వసుంధర వహ్వా ॥ఎంతో॥

(9) [సాంగు సీత రాముని లేడిని దెమ్మనుట.]

మోహనరాగము—ఆదితాళము.

1. నాముద్దు చెల్లింపవె । నాప్రాణనాథా ॥నాముద్దు॥
ఆపైడిలేడీజూడ ఆనందమయ్యె । తెమ్మా ॥నాముద్దు॥
బంగారురంగు వనుచుండి హాహో । రంగైన మేనరవలతళ్కుల । నం
గాను చుక్కలొప్పునీలము । లంగేసు చూపుకలొలయ నాసా ।
రంగంబు నెత్తికొనుచునాడిన భంగంబులేను నాకొసంగుమివేగ॥
నాముద్దు॥

) [సాంగు సీత రాముని రక్షింప లక్ష్మణునిబోమ్మనుట లైలాగు]

దర్బారు—రూపకము.

సీత—1. హా లక్ష్మణా హా శోస్మి । యనుచును నానాథుడార్చెను ।
వైళము నీవటుబోయి । పాలింపగరాదా వాదా ॥హా॥

లక్ష్మ—2. అమ్మా మాయన్నకింతయు । నాపద రాదుకదమ్మా ।
యిమ్మాలికము మదినివిడచి । యుండగదమా మొక్కెద
అమ్మా॥

సీత—3. అదిహితవటరా పాపీ । అన్న పోయిననెనుక నన్ను
మదమునజెరబట్టగ నీ । మదిదలంచినావటరా ॥హా॥

లక్ష్మ—4. శివశివ నీవటుపల్కగ । చెల్లునె పాపము పాపము
భువనేశునిరాముజంచ । బుడమిలోన లేరెవ్వరు ॥అమ్మా॥

(11) [సాంగు సీత రావణునిదూరుట]

హంసధ్వని—ఏకతాళము.

సీత—1. ఓరి రావణా! కుగుణా! । వదనంబులు । గదలింపక । పదవురి
కికి ॥ఓరి రావణ॥

యతివంచును న । న్నతిబూజించితి । పతితుడవై యభిరతిగోర దవే । రాక్షస, స్వాన । యంబుదగ్ధమగుజుమి । నీమూలమునను ఓరిరావణ ॥

రావ—2. బ్రతిమాలితినా । భార్యవుకమ్మా । భామ కోపమును జూపింపకుమా రావె । కౌగిలి । నీవేసీతా అనుపమ సౌఖ్య ము । లందెదుచాలా । శాంతమూని సౌఖ్యమునారసి నీ । కాంతునిగను జేకొనుమా ॥

సీత—3. కారులు ప్రేలక యికచనుమా । క్రూరదానవా । యిక నీమస్తకములను ద్రుంచు । రఘువరుండు । ఛీ, ఛీ, పోరా॥ ఓరిరావణ ॥

రావ—4. ననుగెలువంగును తగునా నీ । నాథుడు సంగ్రామ... కౌగిట జేర్పవె యికలలనా । ఆరడిబెట్టిన మనగలనా ! నా... మెరుగవునుమి చానా॥

సీత—5. క్రూరుడ ! రాముని । ఘోరశరార్చులు । నిను నీకులమును దగ్ధము జేయును ।నిలుమిక నిముషము । నాపతివచ్చును॥ ఓరిరా॥

(12) [సాంగు రామలక్ష్మణులు సీతను వెతకుట.]

పీలువారాగము—రూపకము.

రాము—1. ఎందుబోతివో । సీతా॥ యెందుబోతివో॥
ఎందుమసలుచున్నదానవు ॥ మ్రింగినావో పులులచేత ।
కొండలపఱచిరో దైత్యులు । మందయాన తెలుపవే॥ ఎందు॥

2. నీవులేని పర్ణసాల । యేవిధి దీనతనొప్పెనో ।
రావె! వచ్చిచూడవే యీ । రామునిగుండెలు పగిల్చె ॥ ఎందు॥

3. రామరో ! నీవలననేను మి । రాముని ప్రాణములు నిలచె
యీ మెయి నన్నీవుబాయ । నింకరాముడిల మనునే ॥ఎందు॥



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA127B122 |
| పుస్తకం పేరు | సంపూర్ణరామాయణము |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 153 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |